
చంద్రుని కిరణం సోకిన కమలంలా నెమ్మదిగా
కనుతెరుస్తుంది మీ స్నిగ్ధ సౌందర్యం.



## ముఖచిత్రం

8.1.82 వెలువడిన వారపత్రిక ముఖచిత్రం యాత్రకు వెళ్లకుండనే స్వామివారిని దర్శించుకున్నంత భాగ్యం కల్పించినందుకు ధన్యవాదాలు.

బాలసుబ్రహ్మణ్యం (శక్కర్‌నగర్)

* * *

ది. 8.1.82 ముఖచిత్రం కనుల కింపుగా ఉన్నది. ఈ తరుణంలో స్వామి అయ్యప్ప చిత్రం వేయుట ఎంతో ముదావహం.

మాచిరాజు సత్యప్రసాద్—సురేందర్ (బందర్)

* * *

స్వామి అయ్యప్ప ముఖచిత్రం ఎంతో బాగుంది.

కర్రి నాగేశ్వరరెడ్డి [మార్టేరు]

* * *

స్వామి అయ్యప్ప ముఖచిత్రం భక్తిశ్రద్ధలతో ముందుగా కైమోడ్పులొనరించి పిమ్మట పేజీలను తిప్పించింది. శబరిమలై స్వామి కథ చదివి పరవశించాను.

పెన్మెత్స సూరిబాబు, వెంకటేష్, శేఖర్‌రెడ్డి సాయి (హైదరాబాదు)

* * *

'స్వామి అయ్యప్ప' ముఖచిత్రంతో వెలువడిన వీక్లీ అత్యంత ఆకర్షణీయంగా ఉంది. శబరిమలై వాసుడు స్వామి అయ్యప్పగురించి విపులంగా వ్రాశారు.

పి. వి. రామనాథరావు, డి. శాయికృష్ణ, ఎం. రమేష్‌బాబు [మధిర]

* * *

శబరిమలై స్వామి శ్రీ అయ్యప్ప ముఖచిత్రాన్ని ప్రచురించి ఆ మహిమలను కొన్నింటిని తెలిపినందుకు చాల సంతోషమైనది. స్వామిని దర్శించుటకు వెళ్లే సమయంలో ఇలాంటి ముఖచిత్రాన్ని ప్రచురించారు.

ఎస్. అన్‌సర్ హుస్సేన్ (గిరింపేట)




ది. 8.1.82 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం సందర్భోచితంగాను, చాల ఆకర్షణీయంగాను ఉండి, చాల ఆనందం కలిగించింది.

కొయ్యానిసూర్యనారాయణ (మచిలీపట్నం)

## కథలు

8.1.82 ఆంధ్ర సచిత్ర వారపత్రికకు 'శ్రీ అయ్యప్పస్వామి' ముఖచిత్రం హైలైట్. 'బిళ్లలేని నల్లటోపి' అయ్యో! అయిపోయిందా! అని బాధపడ్డా.

అకెళ్ల సుబ్బారావు (కందికుప్ప)

* * *

8.1.82 స్వామి అయ్యప్ప ముఖచిత్రం వెరైటీగా ఉంది. 'నిషా' కథ బాగుంది. కులమత తత్వాల గురించి చక్కగా చెప్పారు. రచయితగారి అభిప్రాయం నేటి సంఘమునకు సందేశంగా చెప్పవచ్చు.

ఎ. నాగమల్లేశ్వరరావు (మచిలీపట్నం)

* * *

స్వామి అయ్యప్ప ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అత్యంత ఆకర్షణీయంగా ఉంది. మమకారం, నిషా కథలు చాల బాగున్నాయి.

గొడుగురాజు (బిజ్వార్)

* * *

ముఖచిత్రం స్వామి అయ్యప్ప చాలా బాగుంది. కన్నబాబుగారి బిళ్లలేని నల్లటోపి చాలా ఆసక్తికరంగా ఉంది.

బొందిలి సత్యనారాయణసింగ్ (టంగుటూరు)

## సీరియల్స్

శ్రీమతి 'హజరా'గారు సీరియల్‌లో ప్రేమను గురించి వ్రాసిన కొన్ని వాక్యాలు చదివాక ఈ ఉత్తరం రాయకుండా ఉండలేకపోయాను. నిజంగా ఎంతో చక్కగా రాశారు. రచయిత్రికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనాలు,

ఎస్. భారతి (అనంతపురం)

* * *

8.1.82 ముఖచిత్రం మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. జీవితవనంలో కొత్త గాలి సీరియల్ మాకు కొత్తగా ఉంది. ఇందులో సంధ్య పాత్ర వాస్తవానికి దగ్గరగా ఉంది. ముగింపు ఎలా ఉంటుందో! ఆసక్తికరంగా ఉంది. తార సీరియల్ చాల బాగుంది.

బి. సోమేశ్వరమ్మ [పాతశ్రీకాకుళం]

* * *

8.1.82 తేదీన వెలువడిన స్వామి యే శరణం అయ్యప్ప ముఖచిత్రం చాలా బాగుంది. తార సీరియల్ కథ చాల ఇంటరెస్ట్‌గా ఉన్నది.

పి. ఎస్. మురళీకృష్ణ (నాయుడుపేట)

* * *

స్వామి అయ్యప్ప ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా బాగుంది. జీవితవనంలో కొత్త గాలి, తార సీరియల్స్ రెండూ ఇంటరెస్ట్‌గా సాగుతున్నాయి.

పసుపులేటి చంద్రశేఖరరావు [ఏలూరు]

## వ్యాసాలు

హిందీనటి "తమన్నా" ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉన్నది క్రిస్మస్ గాథలు విజ్ఞానాత్మకముగా యున్నవి.

పి. ఆర్. రామకృష్ణ (కదిరి)

## కవితలు

నటి 'తమన్నా' ముఖ చిత్రంతో వెలువడిన 1—1—82 పత్రిక చాలా ఆకర్షణీయముగా ఉన్నది. ఈ సంచికలో ప్రచురించిన కవితలు సందేశాత్మకముగా వున్నాయి. ముఖ్యముగా 'లఖన్' గారి 'మనుగడ తీరా, మనిషి పతనమా' 'సాంధ్యశ్రీ' వ్రాసిన తపః ఫలము గేయాలు చాలా బాగున్నాయి.

వల్లంకొండ శ్రీనివాసరావు (తుమ్మకోట)

## సినిమా

25—12—81 నాటి ఆంధ్ర సచిత్రవార పత్రికలో జి. వి. జి. గారి సినిమా విశేషాలు బాగున్నాయి. ముఖ్యముగ యువ చిత్రవారి 3వ చిత్రంలో కృష్ణంరాజు నటిస్తున్నాడని తెలిసి, మేమెంతో ఆనంద పడిపోయాము. ఆ చిత్రం రాకకోసం, వేయికళ్లతో ఎదురు చూస్తున్నాము.

గొల్లపత్తిని నారాయణ, శ్రీను, దశరథ్ (బొంబాయి)

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
*దేశోద్ధారక కాశీనాధుని*
*నాగేశ్వరరావు పంతులుగారు*
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 1972]

శుక్రవారం : 29–1–'82
దుర్మతినామ సం. మాఘ. శు. చవితి
***సంపుటము 75 : సంచిక 21***

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

✳

పోస్టులో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడిప్రతి వెల రు. 1–25 పైసలు
***ఆంధ్రపత్రిక కార్యాలయము***
గాంధీనగరం, విజయవాడ–520 003

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి ...

కథలు :
- ఫెన్స్ ఫెండ్ (స్పీడ్ కథ) ... 6
- యువతరం కదిలిందా? ... 13
- సుందరమ్మ పెండ్లి ... 26
- కాడి ... 53
- పంతులు బాబాయి ... 61

సీరియల్ నవలలు :
- తార ... 20
- జీవితవనంలో కొత్తగాలి ... 42

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు — 4, లోకం పోకడ — 5, వారఫలం — 12, ధర్మపధం — 18, ప్రశ్నావళి — 25, సినిమా — 34, కేన్సర్ వ్యాధి : కథాకమామిషూ — 48, బొమ్మల మహా భారతం — 50, పోలాక్సని డైరీ — 52, హైదరాబాద్ నోట్‌బుక్— 59, అవీ-ఇవీ-అన్నీ—66.

## లోకంపోకడ ✳ డబిమెన్



పెద్దకథ

# పెన్ ఫ్రెండ్

టి.యస్.ఎ. కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

"రెండు గంటలు ఆలస్యంగా ట్రెయిన్ బెజవాడ చేరిందిరా. టాక్సీలో వెళ్ళాను మ్యాపోస్పల్ కాలనీకి. పెద్ద కష్టం కాలేదు విజయభారతి ఇల్లు కనుక్కోవడం. ఆమె ఇంట్లోనే వుంది నాకోసం ఎదురుచూస్తూ" అంటూ ఆగాడు శంకరం.

"సస్పెన్సులు వద్దు! సూటిగా చెప్పెయ్" అన్నాను సిగరెట్ పీకను యాష్ ట్రేలో పడవేసి కొత్త సిగరెట్ వెలిగించుకుంటూ.

"చెప్పడానికేముందిరా, తను తన ఉత్తరంలో ఎలా వ్రాసిందో అలాగే వుంది. మరీ అనాకారి కాకపోయినా అందగత్తె మాత్రం కాదు."

నేను మౌనంగా వింటున్నాను.

"నేను మనసును అదుపులో వుంచుకుని ఆమెతో రెండ్రోజులైనా స్నేహపూరితంగా గడపాలని అనుకున్నాను. కానీ నా వల్ల కాలేదు, నా భావాలని అర్థం చేసుకుంది కాబోలు నన్ను సులభంగానే వదిలేసిందని చెప్పవచ్చు. 89 ఎక్కి పరిగెత్తుకు వచ్చేశాను" అన్నాడు శంకరం.

"చాల గొప్ప పని చేశావు" అన్నాను. అంతకన్నా ఏం అనాలో తోచలేదు. నా మనసంతా విజయభారతి మీద సానుభూతితో నిండిపోయింది. పాపం విజయభారతి లాంటి చక్కటి వ్యక్తిత్వం కలిగిన స్త్రీ మూర్తికి ఎలాంటి భర్త దొరుకుతాడో? ఏమో? తన భావాలకు తగిన వ్యక్తి దొరకడం మాత్రం అసాధ్యం.

* * *

యల్. సి. ఇ. లో నా సహపాఠి మురళి పెళ్ళికి అటెండ్ అవడం కోసం అనంతపురం వెళ్ళాను నేను. శంకరంకి మురళితో పెద్ద పరిచయం లేకపోవడం వలన పెళ్ళికి రాలేదు నాతోపాటు.

విజయవాడ ఎండలతో పోటీ పడుతున్నట్టున్నాయి అనంతపురంలో ఎండలు. పెళ్ళి పందిరిలో జనం మధ్యా, భోజనాల పంక్తుల్లో జనం మధ్యా నలిగిపోయి, వుడికిపోయిన నేను, కోదండపాణి అనే మరో మిత్రుడూ కలిసి చచ్చి చెడి మా విడిది గృహానికి చేరుకున్నాము.

"ఏ లాడ్జిలోనో దిగక ఇక్కడికి ఎందుకు వచ్చాంరా బాబూ?" అన్పించింది. మా కన్న ముందుగా విడిది ఇల్లు చేరుకున్న పెద్ద మనుషులు కొందరు ప్రతి గదిలోనూ పడకలు పరచుకునేసి నిండిపోయి వున్నారు ఇంటి నిండుగా. చివరికి రెండు కుర్చీలు సంపాదించుకుని వరండాలో కూర్చోగలిగాము వేడి వేడి గాలిని అనుభవిస్తూ.

సహజంగా ప్రతి పెండ్లిలోనూ అతిధులు ఇలాంటి ఇబ్బందులు ఎదుర్కోక తప్పదని పిస్తుంది. పెళ్ళికొడుకు నూతన వధువు ఆకర్షణలో భూమేదో, ఆకాశమేదో తెలియని పరిస్థితిలో వుంటాడు. తక్కిన పెద్దలు అనేక పనులతో సతమతమై పోతూవుంటారు. ఇక మాలాంటి మొహమాటస్థులు అతిధులు ఇలాంటి అవస్థలు ఎన్నో ఎదుర్కోక తప్పదు.

సాయంకాలం వరకూ వేడిని భరించాక లేచి చల్లటినీళ్ళతో స్నానాలు చేసి బట్టలు మార్చుకుని బయల్దేరాము నేనూ, పాణీ. పెళ్ళి పందిరి చేరుకుని మురళిని పలకరించి వాడు తెప్పించిన పెళ్ళి కాఫీని కళ్ళు మూసుకుని త్రాగేసి బైటపడ్డాము, వాక్ వెళ్దాం అంటూ. అక్కడి వాతావరణంలో వేడిని చూస్తే సినిమాకు వెళ్ళాలనిపించదు.

కొద్దిదూరం నడిచాక ఎదురైన ఆటోను ఆపాడు పాణి. అందులో కూర్చున్నాము. "కదిరి రోడ్డులో ఊరి వెలుపలికి పద!" అన్నాడు పాణి డ్రయివర్‌తో.

పదిహేను నిముషాలలో ఊరు దాటి వెలుపలికి వచ్చేసింది ఆటో. ఊరికి బాగా దూరంగా రోడ్డుకు ఎడంవైపు వున్న ఓ పెట్రోలు బంకువద్ద ఆపించాడు పాణి ఆటోను. ఆటోను పంపించేసి బంకు పక్కగా కొంత దూరంలో వున్న బండమీద కూర్చున్నాము, కాస్త చల్లగా వస్తున్న గాలిని అనుభవిస్తూ, కబుర్లలో పడుతూ.

కోదండపాణి ఒరిస్సా ప్రస్తుత రాజధాని భువనేశ్వర్‌లో ఓ పెద్ద బ్యాంకులో సెక్షన్ ఆఫీసరు. మేమిద్దరం కలుసుకుని చాల కాలం అయి వుండడం వలన కబురు నిరవధికంగా సాగిపోతున్నాయి. మధ్యలో శంకరం విషయం వచ్చినప్పుడు నేను అతని పెన్ ఫ్రెండ్ విజయభారతి విషయం అంతా విపులంగా చెప్పాను పాణితో.

"శంకర్ డిడ్ ఎ బ్యాడ్ జాబ్!" అన్నాడు పాణి అంతా విన్నాక.

"ఎలా?"

సిగరెట్ వెలిగించుకుని రెండుదమ్ములు లాగి వదిలిన పాణి చెప్పాడు భావగర్భితంగా.

"రాజా ఉదాత్తంగా కన్పించడం వేరు ఉదాత్తంగా జీవించడం వేరు. ఉదాత్తంగా కన్పించడం చాల తేలిక అయితే, ఉదాత్తంగా జీవించడం చాల కష్టం. అయినా, కష్టం అన్పించినా ఉదాత్తంగా జీవించడంలో ఎంతో తృప్తి, ప్రశాంతత వున్నాయి. ఉదాత్తంగా కన్పించడం అంత ఆత్మవంచన మరొకటి వుండదు ఈ ప్రపంచంలో.

నీవు బహుశా నమ్మకపోవచ్చు... కొద్దికాలం క్రితం వరకూ నేను కేవలం ఉదాత్తంగా కన్పించేవాణ్ని తప్ప ఉదాత్తంగా జీవించాలని అనుకునే వాణ్ని కాను. అయితే ఒకే ఒక్కసారి చాల ఉదాత్తంగా ప్రవర్తించాను. దాంతో నాలో పెద్ద మార్పు వచ్చింది. అప్పట్నుంచీ ఉదాత్తంగా కన్పించడం మానేసి ఉదాత్తంగా జీవించడం నేర్చుకుంటున్నాను" అన్నాడు సాలోచనగా.

"వివరంగా చెప్పరాదూ!" అన్నాను చేతిలో సిగరెట్ విసిరేసి కొత్త సిగరెట్ వెలిగించుకుంటూ అంతలో మేము కూర్చున్నది పెట్రోలు బంకు ప్రాంతం అని గుర్తు

పేరున్నాయి ఆరుమంది ఆడవాళ్ళ, ఇద్దరు మగవాళ్ళు. అందరూ గ్రాడ్యుయేటేనన్నీ, షార్టుహ్యాండులో హండ్రెడ్‌వర్డ్స్ స్పీడు కు తక్కువ స్పీడు కలిగిన వాళ్ళు ఎవరూ లేరనీ తెలుపుతోంది లిస్టు.

ఇంటర్వ్యూ ఇంకా రెండ్రోజులుందనగా లిస్టులోని ముగ్గురు అమ్మాయిల తాలూకు బంధువులు నన్ను కలుసుకున్నారు స్ట్రాంగ్ రెకమెన్డేషన్సుతో. ఇద్దరు మగపిల్లకాయలూ కూడా నన్ను కలుసుకున్నారు. వాళ్ళ వాలకం చూస్తే వాళ్ళు రెకమెన్డేషన్సుతో వున్నట్టే అన్పించింది నాకు.

ఇంటర్వ్యూ రేపనగా ఎంప్లాయిమెంటు ఆఫీసర్ దగ్గర్నుండి నాకు ఫోన్ వచ్చింది.

"మిస్టర్ సాబ్, ఎంప్లాయిమెంట్ ఆఫీసర్‌గా మీకు ఫోన్ చేయడం లేదు ప్రస్తుతం, మానవత్వం వున్న ఒక సామాన్య పౌరుడిగా ఫోన్ చేస్తున్నాను

స్టెనో పోస్టు కోసం మీకు పంపినలిస్టులో వై. సుజాత అనే అమ్మాయి పేరు వుంది కదూ? ఆ అమ్మాయి చాల కష్టాలలో వుంది. ఆమె భర్త పాకిస్తాన్ వాళ్ళతో జరిగిన యుద్ధంలో చనిపోయాడు. ఆ





వచ్చి వెంటనే లేచివెళ్ళి విసరికొట్టిన సిగరెట్ పీకను కాలితో త్రొక్కి తిరిగివచ్చి కూర్చున్నాను.

"సంవత్సరం క్రితం మా బ్యాంకులో సెక్షన్‌లో ఒక స్టెనో పోస్టు వేకెట్ అయింది. పోస్టింగ్ అథారిటీ నాదే. పోస్టు విషయం యంప్లాయిమెంటు ఆఫీసుకు అడ్రస్ చేశాను. ఎంప్లాయిమెంటు ఆఫీసు నుండీ లిస్టు వచ్చింది. ఆ లిస్టులో ఎనిమిది

## పెన్ ఫ్రెండ్

అమ్మాయికి ఇద్దరు పిల్లలు కూడా. వారు కాక ఆమె మీదనే ఆధారపడ్డ వాళ్ళు ఇంకా ముగ్గురున్నారు... ఆమె తండ్రీ, ఆమె భర్త తల్లి దండ్రులూ.

అర్థం అయిందనుకుంటాను ఆమెకు జాబ్ ఎంత అవసరమో? మరొక విషయం ఆమె అందంగా వుండదు, కాస్త అనాకారి అనే చెప్పాలి. అయితే ఆమె వ్యక్తిత్వం, ఆమె మనస్తత్వం ఎంత వున్నతమైనవో నేను చెప్పలేను. చాలా గొప్పవ్యక్తి ఆమె.

కాని, ఆమె అనాకారి అయిన కారణంగా ఆమెకు వుద్యోగం దొరకడం లేదని నా నమ్మకం.

మీరు కొంత వుదారంగా ప్రవర్తించి ఆమెకు వుద్యోగం ఇస్తే ఆమె జీవితం ఓ దారిన పడుతుంది తప్పక!"

అని చెప్పి నా జవాబుకోసం అయినా ఎదురు చూడకుండా ఫోన్ పెట్టేశాడు ఆయన.

ఆ మరునాడు ఇంటర్వ్యూ చేశాను తొమ్మిదిమందినీ. సుజాత వికారంగా వుంది చూపులకు. తక్కిన ఐదుమందీ అప్సరసలలా వున్నారు ఆమె ముందు. ఆ ఐదుమందిలో ఎవర్ని సెలెక్టు చేసినా నా సెక్షన్‌కే కళ వచ్చేస్తుంది. మగవాళ్ళిద్దరూ కూడా సకల అర్హతలతోపాటు రెకమెండేషన్స్ కూడా తెచ్చుకున్నారు.

ఎంతో ఆలోచించాను, వారం రోజుల పాటు సెలెక్షన్ వాయిదా వేసి చివరికి ఒక నిర్ణయానికి వచ్చాను. సుజాతకు ఉద్యోగం ఇచ్చాను.

ఆమెకు ఉద్యోగం ఇచ్చిన తరువాత నేను పొందిన ఆనందం, సంతృప్తి మాటలతో చెప్పలేను. బాహ్య సౌందర్యం తప్ప తక్కిన అన్ని అర్హతలూ ఆమె కున్నాయి. అసలు అలాంటి క్యారెక్టరు కలిగిన వాళ్ళు ఈ ప్రపంచంలో వుంటారా! అన్పించింది ఆమె ప్రవర్తనను చూస్తూ వుంటే.

ఆమె మామూలు మనిషి కాదు. ఏ వుమెన్ ఆఫ్ గ్రేట్ క్యారెక్టర్ ఎండ్ గ్రేట్ మెంటాలిటీ! పైగా మనదేశం కోసం ప్రాణాలు అర్పించిన ఒక వీర సైనికుడి భార్య. ఆమె ఇప్పుడు మా బ్యాంకులో అందరికీ అభిమాన పాత్రురాలు. ఆమెను చూసినప్పుడల్లా నేను ఎంతో గర్వంగా వుప్పొంగిపోతూ వుంటాను.

ఆనేను నిజాయితీగా ఉద్యోగం ఇచ్చినందుకే నేను పొందుతున్న ఆనందం చాలా గొప్పగా వుంది శంకరం విజయాభారతిని వివాహం చేసుకుని ఆమెతో జీవితాన్ని పంచుకుంటే మరెంత ఆనందం అనుభవిస్తాడో కదా?"

అంటూ ముగించాడు పాణి.

పాణి చెప్పిన విషయాలు నాలో కొత్త రకమైన ఆలోచనా విధానాలను రేకెత్తించాయి. ఆలోచనలు గిరికీలుగా నా మనసును చుట్టుముడుతూంటే సిగరెట్ నోట్లో వుంచుకున్నాను. ఇంపోర్టెడ్ సిగార్ లైటర్‌తో వెలిగించాడు కోదండపాణి.

*          *          *

భగవంతుడు నాకు కష్టాలంటూ కలిగించలేదు ఇంతవరకూ ఎప్పుడూ. ప్రేమగా పెంచారు నన్ను నా తల్లిదండ్రులు. ఏదో చదివేవాణ్ని. బొటాబొటీ మార్కులతో పాస్ అయ్యేవాణ్ని. సులభంగా పాలిటెక్నిక్ కాలేజీలో సీటు దొరికింది. యల్. సి. ఇ. అయిపోగానే గవర్నమెంటు ఉద్యోగం దొరికింది త్వరగానే. నాకు తెలిసి నేనెప్పుడూ జబ్బు పడలేదు కూడా.

మా ఊళ్ళో నా పేరిట ఇల్లూ వాకిలీ, పొలం పుట్రా వున్నాయి. నా తల్లిదండ్రులకు నేను డబ్బు పంపాల్సిన అవసరం లేదు. వాళ్ళే నాకు పంపుతూ వుంటారు తరచుగా. నా జీతంలో సగానికి పైగా డబ్బు మిగిలిపోతూ వుంటుంది ప్రతి నెలా.

ఇంత సుఖంగా జీవిస్తున్న నేను ఉదాత్తంగా జీవించాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు. కనీసం ఉదాత్తంగా జీవితం గడుపుతున్నట్లు కన్పించడానికి కూడా ప్రయత్నం చేయలేదు. నేను తటస్థ జీవిని. ఇంతవరకూ ప్రపంచంలో ఎవరికి నావల్ల పెద్ద లాభంగానీ, నష్టంగానీ కలగలేదని చెప్పవచ్చు.

కాలేజీ రోజులలో శశి అనే అమ్మాయిని ప్రేమించాను మనసులోనే. తీరా నేను నా ప్రేమను వ్యక్తపరచాలని ప్రయత్నం చేయబోయే సమయానికి ఆ అమ్మాయి గిరి అనే యువకుణ్ని ప్రేమించి పెళ్ళి చేసుకుని చదువుకు గుడ్‌బై కొట్టేసింది. మా పాలిటెక్నిక్ కాలేజీలో అప్పుడున్న అమ్మాయిలను వేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు. మరెవరూ నన్ను ఆకర్షించలేకపోయారు. అసలు ప్రేమ, పెళ్ళి అనే వాటి మీద ఇంటరెస్టు పోయింది నాకు.

"విజయభారతిని నేనెందుకు పెళ్ళి చేసుకోకూడదు ?" ఈ ప్రశ్న పెరిగి పెరిగి వింతో పెద్దదయింది నాలో, అనంతపురం నుండి తిరిగివచ్చిన తరువాత.

*          *          *

"శంకర్, విజయభారతిని నేను పెళ్ళి చేసుకుంటే నీకేమయినా అభ్యంతరమా ?" అని అడిగాను ఓరోజు ఉరుకులూ పరుగులతో అందంగా సాగిపోతున్న వాగ్గుండీని చూస్తూ.

శంకరం నాకేసి ఆశ్చర్యంగా చూశాడు. తనకి నా ప్రశ్న సరిగ్గా అర్థం అవడానికి కొన్ని నిమిషాలు పట్టింది.

"నీకు పిచ్చిగానీ పట్టలేదు కదా ?" అన్నాడు.

"భగవంతుడి దయవలన అలాంటిదేమీ లేదులే. ఇప్పుడు చెప్పు... నేను ఆమెని వివాహం చేసుకుంటే మనమధ్య స్నేహంలో మార్పులు ఏమీ రావు కదా ?"

"నోరు ముయ్యరా ! నీవు ఆమెను చేసుకుంటే మన స్నేహంలో మార్పెందుకు వస్తుంది ? కొంతకాలం పెన్ ఫ్రెండ్‌గా వున్నాను. నీవు తనని చేసుకుంటే ఓ బ్రదర్‌గానో, ఆర్డినరీ ఫ్రెండ్‌గానో మారుతాను. అంతే !" అన్నాడు శంకరం.

శంకరంలోని స్పెషాలిటీ అదే. జీవితంలో దేన్నీ పెద్ద సీరియస్‌గానూ, సిల్లీగా తీసుకోడు సహజంగా.

"థాంక్స్... నేను ఆమెను పెళ్ళి చేసుకుంటాను త్వరలో !"

శంకరం కళ్ళలో నా పట్ల ఏనాడూ లేని గౌరవం కన్పించింది. లేచివచ్చి నన్ను కౌగిలించుకున్నాడు మంచం మీదే.

"నీవు చాలా గొప్పవాడివిరా ... నీవు నా ఫ్రెండ్ అయినందుకు నేను గర్వపడుతున్నాను !" అన్నాడు.

ఆ రోజే విజయభారతికి ఉత్తరం వ్రాసేశాను ఇలా :

'కుమారి విజయభారతి గారికి,

మీకు నేను శంకరం ఉత్తరాల ద్వారా తెలుసు కొద్దిగా జ్ఞాపకం తెచ్చుకోండి. నన్ను రాజారావు అంటారు. మీరు నాకు బాగా తెలుసు మీ ఉత్తరాల ద్వారా.

మీ ప్రతి ఉత్తరమూ చదివాను నేను. మీ వ్యక్తిత్వం, మీ భావాలు, మీ ఆలోచనా విధానం నన్ను ముగ్ధుణ్ని చేశాయి. నేను మిమ్మల్ని చాలా ఎక్కువగా అభిమానిస్తున్నాను. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని కూడా అనుకుంటున్నాను. నేను మీకు నచ్చితే,






క్షమించాలి. ఇంత డైరెక్టుగా వ్రాసేస్తు న్నందుకు. నా నైజం ఇది.

నన్ను గూర్చి పూర్తి వివరాలు వ్రాస్తున్నాను ఇప్పుడు. నేను గవర్నమెంటు ఉద్యోగిగా నెలకు ఏడువందల వరకూ సంపాదిస్తున్నాను. కొద్దిగా ఆస్తిపాస్తులు వున్నవాడిని. శంకరం కన్న కూడా కాస్త అందంగానే వుంటానని అనుకుంటాను. నాకు బాహ్య సౌందర్యాన్ని గూర్చి పెద్దగా పట్టింపులేదు. మిమ్మల్ని పెళ్ళి చేసుకుని మీతో నా జీవితాన్ని ఆనందమయం చేసుకోగలననే నా విశ్వాసం.

ఇలా సూటిగా ఉత్తరం రాస్తున్నందుకే కాదు, నేను చేయబోతున్న మరో అనాగరికపు పనికి కూడా మీరు నన్ను క్షమించాలి. నేను మీ అనుమతి పొందకుండానే మిమ్మల్ని కలుసుకోవడానికి వచ్చేస్తున్నాను వచ్చే శనివారం నాటి ఉదయాన్నే నేరుగా మీ ఇంటికి వచ్చేస్తాను క్షమించండి. నాకోసం ఎదురు చూస్తారని ఆశిస్తాను.

మిమ్మల్ని కలుసుకునే వరకూ సెకన్లు లెక్కపెడుతూ గడుపుతున్నాను.

మిమ్మల్ని అభిమానిస్తూ, మీతో

## పెన్ ఫ్రెండ్

జీవితాన్ని పంచుకోవాలని ఆకాంక్షిస్తున్న ఒక వ్యక్తి...

రాజారావు,

నన్ను పొగడ్తలతో ముంచేసిన శంకరం ఉత్తరం అందుకుని పరిగెత్తాడు పోస్టుచేయడానికి స్వయంగా.

* * *

ఆఫీసు పనుల వత్తిడివలన రైల్లో, రిజర్వేషన్ చేయించుకోలేక పోయాను.

"ఏకెందుకురా శ్రమ! నే నున్నానుగా" అన్నాడు శంకరం నవ్వి.

వాడు చెప్పే థియరీ ఇది "నీవు – ఇలాగే "ఫ్రాడ్, బ్రీచ్ ఆఫ్ ట్రస్టు నాకు వద్దు. ఐయాం స్ట్రెయిట్ ఫార్వర్డు" ఇలాటి పెద్ద పెద్ద డైలాగులు వల్లె వేస్తూంటే ఈ ప్రపంచంలో బ్రతకలేవురా. ఇప్పుడు చూడు నీకు రిజర్వేషను కావాలంటే రైల్వేస్టేషనుకు వెళ్ళాలి, ఎంతో సేపు క్యూలో నించోవాలి, ఆపై రిజర్వేషను క్లార్కు దయా ధర్మాల మీద రిజర్వేషను సంపాదించుకోవాలి. నీవు ఇంత కష్టపడి రిజర్వేషను తెచ్చుకున్నావనుకో... తీరా రైలు బయల్దేరే సమయానికి ఎవడో వస్తాడు ... టి. సి. కి ఓ రెండురూపాయలు ఎక్కువ ఇచ్చి సునాయాసంగా నీ ప్రక్క బెర్తు సంపాదించుకునేస్తాడు రెండే రెండు నిముషాలలో. అపై హాయిగా నిద్రపోతాడు మరో రెండు నిముషాలలో. వాడి హాయి చూస్తే కష్టపడి బెర్తు సంపాదించుకున్న నీకు నిద్ర పట్టదు.

కాబట్టి భాయీ సాబ్, మీరు రిజర్వేషను గూర్చి బెంగపడక ఏ ట్రెయిన్‌కు వెళ్తారో చెప్పండి చాలు!"

శంకరం చెప్పేదీ నిజమే అన్పించింది. మారిపోతున్న ఈ ప్రపంచంలో మానవుడు బ్రతకాలంటే ఎంతో చాకచక్యం కావాల్సిందే. అక్కడక్కడ అంతరాత్మ నోరు ముయ్యక తప్పదు కూడా!

"తిరుమలాకు వెళ్తే బావుంటుందనుకుంటాను" అన్నాను.

శుక్రవారం రాత్రి పదిగంటలకు రైల్వే స్టేషను చేరుకున్నాము. గూడూరు లో తిరుమలా ఎక్స్‌ప్రెస్ దాదాపు పాతిక నిముషా

వరకూ ఆగుతుంది ఇక్కడినుండి ఎలక్ట్రిక్‌తో నడుస్తుంది తిరుమలా. అందువలన ఇంజను మార్పు కూడా ఇక్కడే జరుగుతుంది.

వియిర్‌బ్యాగ్ క్రింద పెట్టి విల్సుస్పేక్ లాంగ్ సిగరెట్ కాలుస్తూ రెండవప్లాట్‌ఫాం మీద నిలబడ్డ నాకు నవ్వువచ్చింది. వింద కంటే టిక్కెట్టు కొనుక్కొచ్చిన శంకరం ఓ రిజర్వేషను కంపార్టుమెంటు టి. సి. ని బిడ్డలా పట్టుకున్నాడు. ఆ టి. సీ. ఎవరో అమాయకుడిలా వున్నాడు. కసిరికొట్టడానికి బదులు ఎంతో మర్యాదగా జవాబిస్తున్నాడు.

"బాబూ బెర్తులు ఏమీ ఖాళీలేవయ్యా! నా కంపార్టుమెంటులో, వెళ్ళి మెద్రాసు కోటా వున్న కంపార్టుమెంటులో ప్రయత్నం చెయ్యండి" అంటున్నాడు ఓపికగా.

"మెద్రాసుకోటా ఫుల్ అయిపోయిందండీ, అందుకే మిమ్మల్ని కలుస్తున్నది ... మన విక్టర్‌గారు లేరూ, అదేనండీ విక్టర్‌గారు... ఆ మధ్య బెజవాడలో కలిశారులే ... నాకూ ఆయనకూ మాంచి స్నేహం... ఆయనన్నారు నీకెప్పుడైనా ఏదయినా హెల్పు కావాల్సివస్తే మా హైడిరాజుగార్ని అడుగు అన్నారండీ ... అప్పట్నుంచి మాక్కావల్సింది ఒక బెర్తే...ఒక్క బెర్తు చాలు..." అంటున్నాడు శంకరం.

ఆ టి సీ. నే ననుకున్నట్లు అమాయకుడే ...ఐస్ అయిపోయాడు. బిల్‌బుక్ తీసి ఓ బెర్తు రాసి ఇచ్చేశాడు చకచకా అంతేకాదు స్వయంగా బెర్తు ఎక్కడుందో కూడా చూపించాడు.

బెర్తు మీద వియిరుబ్యాగు — పడవేసి మళ్ళీ ప్లాట్‌ఫాం మీదికి వచ్చాను.

"విక్టర్ ఎవరు ? హైడిరాజా ఎవరు ? ఏమిటి ఈ గందరగోళం ?" అని అడిగాను శంకరాన్ని.

"ఈ టి. సి. పేరు హైడిరాజా. ఇతని మామగారో, మరో బంధువో విక్టర్ గారనే వ్యక్తి వున్నాడని విన్నాను. ఇద్దరూ నాకు పరిచయం లేదు. చెప్పానుగా ఈ సమాజంలో అప్పుడప్పుడు మోసంచెయ్యకపోతే సుఖంగా నడిచేది కష్టమని" అన్నాడు శంకరం నవ్వి.

ఎలక్ట్రిక్ ఇంజను కూత పెట్టింది. నేను పెట్టెలోకి ఎక్కాను. రైలు కదిలింది.

"విష్ యూ ఆల్ ది బెస్ట్, బై" అన్నాడు శంకరం రైలుతోపాటు పెద్ద పెద్ద అడుగులు వేసి చేయి వూపుతూ.

రైలు చేస్తున్న భయంకరి శబ్దాలతో నాకు నిద్ర చెదిరిపోయి మెలకువ వచ్చేసింది. అరచేతని కళ్ళకద్దుకుని బెర్తుమీంచి క్రిందికి దిగాను క్రిష్ణాకెనాల్ జంక్షనును వదిలేసిన రైలు వంతెన మీద నడుస్తోంది, భయంకరంగా శబ్దాలు చేస్తూ. క్రింద క్రిష్ణానది నరవళ్ళు త్రొక్కడంలేదు. నెమ్మదిగా పారుతోంది. ప్రకాశం బ్రిడ్జికి క్రొత్తగా అమర్చిన విద్యుద్దీపాలు తోరణాలలా అద్భుతంగా కన్పిస్తున్నాయి.

చేతి గడియారం చూసుకున్నాను మూడు ముప్ఫై నిముషాలు మాత్రమే అయింది. కొద్దిసేపట్లోనే విజయవాడ రైల్వేస్టేషనులో నాలుగవ నంబరు ప్లాట్‌ఫారంమీద ఆగింది తిరుమలా ఎక్స్‌ప్రెస్.

తెల్లవారుఝామున మూడు ముప్పావుకే విజయవాడ చేరిన రైలు నన్ను సందిగ్ధంలో పడవేసింది. చేరవలసిన సమయం నాలుగున్నర. తమ జాతి ఆనవాయితీ ప్రకారం కనీసం అరగంట ఆలస్యంగా అయినా ఐదు గంటలకు చేరుతుంది. బయల్దేరి వెళ్ళి విజయ భారతి వాళ్ళ ఇల్లు చేరుకునేసరికి తెల్లవారిపోతుంది అనుకున్నాను. కానీ ట్రెయిన్ బిఫోర్‌గా రీచ్ అయింది.

బ్రిడ్జి ఎక్కి 1 ఏ నంబరు ప్లాట్‌ఫాం మీద దిగి, అధునాతనంగా తయారైన స్టేషనులోంచి వెలుపలికి వచ్చాను.

నలుగురైదుగురు రిక్షావాళ్ళు నాదగ్గరకు దూసుకు వచ్చారు రిక్షా అవసరం లేదని చెప్పి సిగరెట్ వెలిగించుకున్నాను

రిక్షా వాళ్ళందరూ వెళ్ళిపోయినా ఒక కుర్రవాడు మాత్రం వదల్లేదు నన్ను.

"సార్ ఆర్‌టీసీ బస్టాండుకైనా, దుర్గ మెట్లదగ్గ రికైనా,స్నానాలఘట్టందగ్గ రికైనా ఒక్క రూపాయి ఇవ్వండి సార్ చాలు" అంటున్నాడు.

బెజవాడలో రిక్షా చార్జీలు ఫర్వాలేదు. పసితనం వీడని ఆ రిక్షా కుర్రాడిని చూస్తూ వుంటే బాధేసింది. అయినా పైకి మాత్రం "ముప్పావలా" అన్నాను.

"సరేసార్! రండి ఫోనీ అయినా అవనీ" అంటూ వాడు నా బ్యాగు అందుకున్నాడు. వాడి రిక్షాలో కూర్చునాకగానీ ఎక్కడికో ఒక చోటికి వెళ్ళక తప్పదు అన్నది స్ఫురించలేదు.

"క్రిష్ణగట్టుకి పోనీ!" అన్నాను బిర్ద కంగా.

రిక్షా కుర్రవాడు నిక్కి నిక్కి రిక్షా త్రొక్కుతుంటే నాకు ముళ్ళ మీద కూర్చున్నట్టే అన్పించింది. భగవంతుడు మానవులమధ్య ధనవంతులూ, పేదవాళ్ళూ అనే తేడాలు ఎందుకు సృష్టించాడా అన్పించింది.

ప్రకాశం బిడ్జి వెనుకనున్న స్నానఘట్టం వద్ద దిగి ఒకరూపాయి ఇచ్చి రిక్షా కుర్రాణ్ణి పంపేశాను. స్నానఘట్టంలో స్నానం చేస్తున్న వారు ఒక్కరూ లేరు. వియిర్‌బ్యాగు మెట్టు మీద పెట్టి, బట్టలు విప్పి బ్యాగు మీద పడవేసి క్రిష్ణలో బాగా తలస్నానం చేశాను. బట్టలు మార్చుకుని వియిర్‌బ్యాగ్ సర్దుకుని దగ్గరేవున్న ఆంజనేయస్వామికి నమస్కారం పెట్టి బయల్దేరాను.

విద్యుద్దీపాలతో మెరిసిపోతున్న విజయవాడను కనిపించినంత మేర చూసుకుంటూ మెటాడార్ రూటమ్మట దుర్గకొండ ఎక్కి, దుర్గాదేవిని దర్శనం చేసుకుని, మెట్లమ్మట క్రిందికి దిగివచ్చేసరికి, బాగా తెల్లవారిపోయింది

మెయిన్‌రోడ్డులోకి వచ్చి కొంతసేపు నిలుచున్నాను. ఓ టాక్సీ వచ్చింది ఖాళీగా. దాన్ని ఆపి ఎక్కాను అడ్రసు చెప్పి. ట్రాఫిక్ లేని రోడ్ల మీద వేగంతో పరుగులు తీసింది టాక్సీ.

న్యాపోస్టలు కాలనీలో నే చెప్పిన ఇంటి నంబరు వెతుక్కుంటూ నెమ్మదిగా టాక్సీని నడిపి సరిగ్గా విజయభారతి ఇంటిముందే ఆపాడు డ్రయివరు. ఇల్లు వెతుక్కోవాల్సిన సమస్య లేకుండా పోయినందుకు సంతోషిస్తూ, డబ్బు చెల్లించి టాక్సీ పంపేశాను.

(ఇంకా వుంది)

## సద్గమయ

ఇరుదారుల గది మన హృదయం
ఒకదారి సత్, మరొకదారి అసత్
మెదడు మేడ దిగివచ్చే ఆలోచనలు
సత్-మార్గం గుండా పయనిస్తే
ప్రపంచాన్ని ఉద్దీప్తం చేయగలవు
అసతో మా సద్గమయ.

— కట్టా నరసింహులు



# వారఫలం

## 29-1-1982 శుక్రవారం మొదలు 4-2-1982 గురువారం వరకు

**మేషం:—** గోచారగ్రహాలలో కలిగినమార్పులు మీకు వ్యాపార వ్యవహార, పత్రికా ప్రకటన గ్రంథ కర్తృత్వమున కావలసినన్ని అవకాశాలుండగలవు. రావలసిన ధనం సమయానికి అందుతుంది. స్త్రీలకు: గృహోదాయం, కుటుంబ నందం వృత్తిలో పెంపు గలవారం. అనుకోనవిధంగా ఒకానొక మేలు సంభవింపనున్నది.

**వృషభం:—** విద్యార్జనలో, ధనార్జనలో, ప్రగతి కనిపింపగలదు. రాశికి ఆరవ యింట స్థితుడైన గురు గ్రహం శుభ వ్యయానికి కారకుడు. ఎంత రాబడి ఉన్నా చాలకపోవటం గమనింప దగిన అంశం. కొందరికి క్రీడా రంగానుకూలత చేకూర గలదు. స్త్రీలకు ఉద్యోగ వృత్తులందు ప్రగతి, నూతన విషయ సేకరణకు అనుకూలత గల వారమే.

**మిథునం:—** మీ యింట శుభ ప్రస్తావన లేగాక, శుభ కార్యానుకూలత చేకూర గలదు. క్రొత్త విషయాలు అనేకం తెలిసికొనుటకు అవకాశములేర్పడ గలవు. గృహ నిర్మాణమో, నూతన గృహాన్ని తలపని తలంపుగ కొనుగోలు చేయుటమో జరుగుతుంది. స్త్రీలకు : కుటుంబ నందం వయసులోనివారికి వివాహానుకూలత ప్రయత్నాలు సాగగలవు.

**కర్కాటకం:—** రచనా విధానంలో పినీ రచనలో, నూతనావకాశాలు ఏర్పడే అనుకూలత గలవారం. వైద్య వృత్తి వికాసానికి దోహదం చేయు గ్రహస్థితి గలదు. మిత్రులెవరో మీకు ఒకానొక విషయ పరిష్కారానికి సహాయం చేయుగలరు. ఆదాయమున్నదని వేరుగా చెప్పనక్కర లేదు. స్త్రీలకు విందు వినోదములలో పాల్గొనుటకు, సంతానమూలకంగా ఆనందానికి లోపం రాదు.

**సింహం:—** క్రయ విక్రయాలలో, భూ సమస్య పరిష్కారంలో మీకు సర్వానుకూలత చేకూరగ నున్నది. రచనా విధానంలో కొందరికు క్రీడా రంగానిలో కొందరకు అవకాశాలుండగలవు. స్త్రీలకు: ఆదాయం అభివృద్ధి, వృత్తిలో పెంపు సమకూర నున్నది. బంధువుల మూలకంగా ఏదో మేలు చేకూర నున్నది.

**కన్య:—** పది మందిలో మీకు గౌరవ ప్రతిపత్తులుండ గలవు. సభ గౌరవానికి, పత్రికా గౌరవానికి, క్రీడా రంగంలో నూతనావకాశాలుండగలవు కొందరకు. ఉద్యోగంలో ప్రగతి, అంటే 'ప్రమోషన్' వచ్చే అవకాశముంటుంది. సంతాన మూలకంగా ఆనందం ఏర్పడే వారం. స్త్రీలకు: గౌరవం, సుఖ శాంతులు, కొందరికు చిత్ర రంగంలో అవకాశాలు ఏర్పడగలవు. ఆరోగ్యలోపం లేని వారం.

**తుల:—** ఆరోగ్య భాగ్యానికి తోడు, భాగ్యం ఏదో రూపంగా సమకూడే వారం. ముఖ్యులతో సంభాషణలు, ఏదో శుభ కార్యం నిమిత్తంగా జరుగగలవు. ఉద్యోగంలో కొందరికి ఈ రాశి వారికి 'ప్రమోషన్' సంప్రాప్తింప గలదని ఎదురు చూడవచ్చు. స్త్రీలకు: సుఖ భోగ భాగ్యాదులకు ఆయురారోగ్యానికి అవకాశం గల వారం.

**వృశ్చికం:—** అన్ని విధాలా, అన్ని రంగాలలోను ముఖ్యంగా వ్యాపార రంగంలో మీకు సదవకాశాలు లభింప గలవు. అదృష్ట వంతమైన వారంగా భావించి మెలగండి. వృథాగ కాలాన్ని వ్యయం చేయకండి. కళా సాహిత్య రంగాలలో మీకు అవకాశాలు లభించటమే గాక, లబ్ధి కూడ కనిపిస్తుంది. స్త్రీలకు: నూతనవస్తు సేకరణ, విషయ సేకరణ గల వారమే.

**ధనుస్సు:—** మీతో సహకరించి, మీకు సహాయం చేయాలని మిత్ర వర్గీయులో, బంధు వర్గీయులో, ప్రయత్నము సహాయం చేయుచున్నారు. ఏదో ఒకంగా భావంపాదన చేయుచున్నారు. బంధు ప్రీతి గలవారం. స్త్రీలకు వృత్తిలో, చేసే ఉద్యోగంలో, సంపాదనా మార్గంలో ప్రగతి సూచకవారం.

**మకరం:—** గృహ నిర్మాణమో, గృహాన్ని కొనుటకో, భూమిని సంపాదించుటకో బంధువుల మూలాననో, పరిచితులమూలాననో ప్రయత్నములు చేయుచున్నారు గదా! యోచించి కార్యానికి ఉపక్రమించండి. కావలసిన ధనం చిక్కే అవకాశం కూడా గలవారమే. స్త్రీలకు: ఆదాయం సమకూడటం, సంతాన మూలకంగా ఆనందం కలుగగలదని గ్రహించాలి.

**కుంభం:—** రంగస్థల నటులకు, గాయకులకు, పత్రికా రచయితలకు గ్రంథకర్తృత్వమున చేయి తిరిగిన వారికి, దైవ సేవయందు నిమగ్నులైన వారికి, కళారంగంలో అనుభవం గడించిన వారికి సదవకాశాలు ప్రాప్తింపగలవు. ఉద్యోగం సాఫీగా సాగుటకు లాభ సంపాదనకు అవకాశమున్నది. స్త్రీలకు: పాలుగువిధలా ధనాదాయమున్నది. రావలసిన ధనం అందుతుంది.

**మీనం:—** గ్రహించండి. సర్వానుకూలతగల వారం. పత్రికా సంపాదకత్వమున మీకు మేలు చేకూరనున్నది. ఒక వేళ 'ప్రమోషన్' వచ్చినా ఆశ్చర్యం లేదు. క్రీడారంగంలో చాల మందికి సదవకాశాలు లభింప గలవు. రాజకీయంగా అనుకూలత గలదు. స్త్రీలకు: కళా సాహిత్య రంగాలలో అభిప్రాయత్నావకాశాలు, ఆదాయం చేకూర గలదనీ, నగలు కొనే ప్రయత్నమున్నదని గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# యువతరం కదిలిందా?

ప్రఫుల్లచంద్ర



ఆగస్టు పదిహేను ...

కాకినాడ రైల్వే ప్లాట్‌ఫాం మీది కుర్రకారు ఫెళ ఫెళ లాడిపోతోంది. గోల, కేకలు, అరుపులు - స్వతంత్ర దిన చిహ్నాలు!

గోల భరించలేక సోమసుందరం ముఖం చిట్లించు కున్నాడు.

సర్కార్ ఎక్స్‌ప్రెస్ ప్లాటుఫాం మీదకు వస్తున్న కొద్దీ విద్యార్థుల గోల, హర్షాతిరేకం ఎక్కువ అవుతున్నాయి. ట్రెయిన్ ఆగగానే విద్యార్థులందరూ బిల బిల ఎక్కేసారు. ట్రెయిన్ నిండా వాళ్ళే. బెర్తులూ, సీట్లూ అన్నీ ఆక్రమించేసారు. వాళ్ళెవరూ టికట్ కొనలేదని తెలుస్తూనే వుంది. స్వతంత్ర దినోత్సవం అంటే టికట్ లెస్ ట్రావెల్!

కాని టికట్ వున్న ప్రయాణీకులు మాత్రం నిల్చోడానిక్కూడా చోటు లేక అవస్థ పడుతున్నారు. సోమసుందరం అసహనంగా చుట్టూ చూసాడు. తనూ, భార్య, కొడుకు, కూతురూ – కట్టకట్టేసట్లు నిలుచున్నారు. తన ప్రక్కనే ఒక ముసలమ్మ, మనవడు – పల్లెటూరి వాళ్ళలా వున్నారు.

అసలే చోటు లేక ఉక్కిరి బిక్కిరిగా అవస్త పడుతుంటే, అందర్నీ నెట్టుకుంటూ, పరాచికాలాడుతూ, అరుస్తూ విద్యార్థులు – కంపార్ట్‌మెంట్ ఈ చివరి నుండి ఆ చివరకు అదేపనిగా తిరుగు తున్నారు.

వాళ్ళ దృష్టి తన కూతురు మైథిలి మీద పడినట్లు గ్రహించాడు సుందరం. ఆమెను రాసుకుని, నెట్టుకుని, కామెంట్స్ రువ్వుతూ అటూ యిటూ తిరుగుతున్నారు వాళ్ళు.

సుందరం గుండె భగ్గుమంది. కూతురు వైపు ఓరగా చూసాడు. తల వంచుకుని విగ్రహంలా ఉండి పోయిందా మె, తల్లి వర్ధనమ్మని ఆనుకొని. కొడుకు కిషన్ – వాళ్ల బండ కామెంట్స్ ఎవరికో అయినట్లు – నవ్వుకుంటున్నాడు.

చూపించిన హీరోయిజం చాలనుకున్న కొందరు అర్భకులు సామర్లకోట స్టేషన్‌లో దిగిపోగా ఆ సీట్లలో సర్దుకున్నారు సుందరం కుటుంబం; ముసలమ్మ, మనవడు.

కుందనపు బొమ్మ లాంటి మైథిలిని వదిలి పోవాలనిపించలేదు కొందరికి. వాళ్ళు ఎదుటి సీట్లు ఆక్రమించి, జోకులు పేల్చు కుంటున్నారు. ఒక్కటైనా హిట్ కాక పోతుందావి.

సుందరం మనసులోనే వాళ్ళకు పేర్లు పెట్టుకున్నాడు.

కిటికీవద్ద మైథిలికి ఎదురుగా కూర్చున్న వాడు మిస్టర్ జుత్తులు! వాడి తలనిండా, ఛాతి నిండా జుత్తే. షర్ట్ బటన్స్ విప్పేసి చివరి దొక్కటే బిగించాడు. కాస్త వయం!

ఇక రెండోవాడు – జుత్తులు వేసే చచ్చు జోకుల్ని భరిస్తూ, భళ్ళున నవ్వుతూ, అతని ఆజ్ఞలను శిరసావహించే నమ్మకమైన బంటు – మిస్టర్ హనుమంతు.

మిగిలిన వాళ్ళు తాన తందాన గాళ్ళు; కిచకిచగాళ్ళు! మనిషిలా ఉండే కోతిని వానరం అంటాం కనుక కోతుల్లా ప్రవర్తించే వీళ్ళను "వావానరాలు" అనడమే సబబు!

ధరించిన దుస్తులు, కేశ సంపద, గొంతు పుష్టిని బట్టి – ఈ దండుకి – మిస్టర్ జుత్తులు నాయకుడు అనుకోవాలి.

వీళ్ళా యువతరం ప్రతినిధులు! – హేళనగా అనుకున్నాడు సుందరం.

వీళ్ళింత బాధ్యతా రహితంగా తయారు కాడాన్కి కారణం ఎవరు?

ఉపాధ్యాయులు! నాయకులు!! పెంచడం చేతకాని తల్లిదండ్రులు!!

## యువతరం కదిలిందా?

మరి తన కొడుకు కిషన్ యువతరం ప్రతినిధి కాదా? అయినా వాడు వీళ్ళలా ఎప్పుడూ ప్రవర్తించడు

అదీ...అదీ... తన పెంపకం!

సగర్వంగా గుండె నిండా గాలి పీల్చుకున్నాడు సుందరం.

విద్యార్థుల అల్లరి శృతి మించి, మాటలకు చేతలు జత అవుతున్నాయి. మిస్టర్ జాత్మలు అసభ్య సినీగీతాలు పాడడం, తాను హీరోయిన్ అయినట్లు మిస్టర్ హనుమంత్ అసహ్యంగా ఒళ్ళు ఊపడం...

అది చూసి కుర్రకారు కిచకిచలు... గోండ్రింపులూ ...

పెద్దల అసహనం...గుర్రు.

తలవంచుకుని కూర్చున్న మైథిలి పెదవులు దరహాసంగా అరవిచ్చుకుని చెక్కిలి కాంతివంతమైంది. లోలోనే వినోదిస్తున్నదామె. గ్రహించిన మిస్టర్ జాత్మలు మరింత రెచ్చిపోతున్నాడు కిషన్ ఉత్సాహంగానే నవ్వుతున్నాడు. సమీపంలో తండ్రి లేకపోతే అతడూ ఆ గుంపులో చేరేవాడేమో! ఈ గోల అంతా తన చెలి దృష్టిని ఆకర్షించడానికేనని గ్రహించలేని అమాయకుడు కిషన్!

"ఇంద...యింద ... తీసుకో ... ఇప్పుడే స్వంతం చేసుకో..." ఛాతి అసహ్యంగా ఊపుతూ పాడుతున్నాడు జాత్మలు. అతని భుజం చుట్టూ ఒక చేయి వేసి దగ్గరగా లాక్కుంటూ ఛాతి నిమురుతున్నాడు హనుమంత్.

కుర్రకారు ఈలలూ, చప్పట్లూ!

పెద్దల ముఖాల్లో జుగుప్స...అసహ్యం...

విద్యార్థులు – అదలిస్తే ఆబోతులు, కదిలిస్తే కందిరీగలూ అవుతారని – ఎవరి మట్టుకి వారే సహనం వహిస్తున్నారు.

మైథిలిని ఓరగా చూస్తూ "గుంట నవ్వుతోంది గురూ! కాని ముసలాడి ముఖం కందగడ్డ అయింది" గొణిగాడు హనుమంతు జాత్మలు చెవిలో.

ఇక భరించలేక పోయాడు సుందరం. గొంతు సవరించుకున్నాడు "అబ్బాయిలూ! మీరెంతవరకు వెళుతున్నారు?" సాధ్యమైనంత సౌమ్యంగా అడిగాడు జాత్మల్ని.

ఇక ఈయన నీతిబోధ మొదలెడతారు కాబోలు– అనుకున్నాడు కిషన్. ఇంటో,

అయితే తండ్రి చండశాసనుడే ఎవరే తప్పు చేసినా ముందు సౌమ్యంగానే అదీ యిదీ మాట్లాడి, అసలు విషయాన్కి వచ్చి అర గంట నీతిబోధ చేస్తారు. చెల్లి, తనూ కిక్కురుమనకుండా "బుద్ధిగా" తలలు వంచుకుంటారు. ట్రెయిన్‌లో ఈయన్ని ఎవరు గౌరవిస్తారు? ఉపన్యాసాలు ఎవరు వింటారు? పైగా వేళాకోళం పట్టిస్తారు. ఈయన ఒక అరగంట నోరు మూసు క్కూ మంటే చాలు రాజమండ్రి వస్తుంది. మర్యాదా దక్కుతుంది— అనుకుంటూ అసహ నంగా తండ్రి వైపు చూశాడు కిషన్.

"మీ రెక్కడికో మేమూ అక్కడికే తాత గారూ!" మైథిలి వైపు ఓరగా చూస్తూ అతి వినయంగా చెప్పాడు జాన్తులు.

"తాతగారూ! అంటాడా? ఇంయ్" కోపం ముంచుకు వచ్చింది సుందరానికి. తాత గారూ అన్నందుకే అంత కోపం వచ్చింది కాని— హనుమంతు "మావగారూ— అని పిలవరా!" అని జాన్తులు చెవిలో చెప్పిన సలహా విని వుంటే భగ్గుమనేవాడు కాబోలు సుందరం

కాని కోపాన్ని అదిమిపట్టి "చూడు బాబూ! ఏమిటీ గోల" అన్నాడు మృదువుగా.

"గోల కాదండీ, సరదా! స్వతంత్ర దినం కదా!"

"మీ సరదా యితరులను బాధించ కూడదు."

"మేమెవర్ని బాధ పెట్టామండీ!... మిమ్మల్నా?... మిమ్మల్నా?... మిమ్మల్నా?" అమాయకంగా ముఖం పెట్టి— బాధ పడు తున్నవారిని వెదుకుతున్నట్లు ఒక్కొక్కరి ముఖమూ పరిశీలించాడు జాన్తులు.

అతని అమాయక స్వరం, అద్భుత నటన చూసి ముసిముసిగా నవ్వుకున్నారు కుర్రకారు. మాటలతో గుచ్చినట్లుంది సుందరానికి.

"ఈయన యిప్పటికైనా నోరు మూసు కుంటే బాగుండును" అనుకున్నాడు కిషన్.

"స్వతంత్రం అంటే విచ్చలవిడితనంకాదు. నోరు పారేసుకోడమూ కాదు. టికట్ లేని మీరంతా సీట్లు ఆక్రమిస్తే, టికట్ వున్న వాళ్లంతా నిలుచున్నారు. ఇది న్యాయమా? స్వతంత్రం అంటే న్యాయాన్ని ఉల్లంఘించ డమా?"

"ఏమిటండీ! ఊరకుంటున్న కొద్దీ ఉప న్యాసం దంచుతున్నారు! మా వద్ద టికట్ లేదని ఏ వెధవ చూశాడు?" తీవ్రంగా అంటూ జేబులోని టికట్ తీసి గాలిలో ఊపి మళ్ళా జేబులో పడేసుకున్నాడు జాన్తులు.

వాళ్లెవరివద్దా టికట్లు లేవని భావిస్తూ వచ్చిన సుందరం ఖంగు తినేశాడు "మా బాగా అయింది" అనుకున్నాడు కిషన్. కాని తండ్రి ముఖం చూస్తే జాలివేసిందతనికి

పాలిపోయిన సుందరం ముఖం చూసి నవ్వుకున్నారు మిత్రులు. తీవ్రంగా ఆలోచి స్తున్నాడు సుందరం— అతని వద్దకు టకట్ ఎలా వచ్చింది? కొన్నాడా? లేక...

"నాయనోయ్! దేవుడోయ్! నేనేం జేతున్రా భగవంతుడా?" ముసలమ్మ ఉన్న ట్లుండి ఘొల్లుమంది.

రాజమండ్రి ఆసుపత్రిలో ఆమె కూతురు చావు బ్రతుకుల మధ్య ఉంది. రెండు వంద లిస్తేగాని ఆపరేషన్ చేయనని డాక్టరు మొండికెత్తితే అప్పుచేసి డబ్బు తీసుకెళ్తోంది ముసలమ్మ. రొంటిని దోపుకున్న డబ్బు సంచి ఎవరో కొట్టేశారు దానిలోనే టిక్కెట్టూ వున్నాయి. "ఏ నచ్చినోడు కొట్టేసాడోగాని వాడి చేతులు పడిపోనూ! వాడిని మహమ్మారి లాక్కుపోనూ" దీర్ఘాలు తీస్తూ హృదయ విదారకంగా ఏడుస్తున్న దామె.

ముసలమ్మ శోకాలు జాన్తులకు నవ్వు తెప్పించింది. "ఏడిస్తే, పోయిన డబ్బు దొరుకుతుందా మామ్మా! ఆ ఏడుపేదో డాక్టరు కాళ్ళు పట్టుకుని ఏడు! లేదా నే నొక కత్తి యిస్తాను నీవే పరపర ఆపరేషన్ చేసెయ్" అన్నాడు గలగల నవ్వుతూ.

అదో పెద్ద జోక్ అయినట్లు తాని తందానలు బలబలలాడితే, హాహానరాలు కిచకిచ మన్నాయి.

ఏదో స్ఫురించి తన జేబులువెదుక్కున్నాడు సుందరం. అతని ముఖం మరింత గంభీరం అయింది.

"కష్టాల్లో వున్న వారిని చూసి నవ్వడం— అదేం సంస్కారమయ్యా?" నొచ్చుకుంటూ అడిగాడు.

"మావగారు మళ్లీ మొదలెట్టాడు రోయ్" వెకవెక మన్నాడు హనుమంతు.

"పిల్ల నెవరు నమ్మమన్నారు! కంట్లో ఏడుపుచూసి మీలాంటి దయార్ద్రహృదయులు తలో రూపాయి పారేస్తారని వేషాలు!" అనేశాడు జాన్తులు.

"ఒరేయ్, ఒరేయ్! ఎంత మాట అన్నా వురా! నేను ముష్టిదాన్నా? నావి వేషాలా?" ఆడపులిలా గర్జించిందామె. కాకపోతే పళ్లూడిన ముసలి పులి స్వరంలా కీచుగా



# యువతరం కదిలిందా?

వినిపించింది ఆ స్వరం మిత్రులకు మహా వినోదంగా వుంది. నవ్వుకున్నారు.

మనవడు తీవ్రంగా వాళ్ళవైపు చూసాడు. గాని ఏం చేయగలడు? ఇలా ఎవరి మటుకు వారు— నా కెందుకని ఊరుకోవడం వల్ల— సరియైన ప్రతిఘటన లేక రెచ్చిపోతున్న విద్యార్థులను చూసి ఇక కోపం ఆపుకోలేక పోయాడు సుందరం.

"యూ రాస్కెల్! షటప్! నీవు విద్యార్థివా? దొంగవి! ఆమెను ముష్టి దంటావా?" గర్జించాడు సుందరం.

ఈ గర్జన— ముసలి పులి కీచు స్వరంలా లేదు గుండెను జలదరింప జేసి, కర్ణపుటాల్ని బద్దలు చేసేటట్టుంది. మంత్రించినట్టు అందరూ దిగ్భ్రమగా, శిల్పాలా ఉండిపోయారు.

"హుం! మీరా విద్యార్థులు?! యువతరం ప్రతినిధులు?! భావి భారత పౌరులు! కాదు... కానేకాదు...ఒక అసహాయురాలి డబ్బుకాజేసిన నికృష్టులు! నీతి నియమాల పట్ల గౌరవం లేని జులాయిలు! సాటి మానవులను గౌరవించ లేని సంస్కార హీనులు! పోరంబోకులు!... ఇచ్చేయ్ ఆమె డబ్బు!" కంచులా మోగింది సుందరం స్వరం.

అప్పటికి స్పృహ వచ్చింది మిత్రులకు. ముఖాలు అరుణిమ దాల్చాయి. చూపులు పదును తేలాయి. స్వరంలో వేళాకోళం పోయి తీవ్రత హెచ్చింది

"మతిపోయి వాగుతున్నావ్. బండి దిగి ప్రాణాలతో ఇంటికి వెళ్ళాలని లేదా?" అరిచాడు జుత్తులు.

హఠాత్తుగా వాతావరణం వేడెక్కిపోయింది. పెద్దలు ఉత్కంఠగా, యువకులు ఆవేశంగా చూస్తున్నారు.

"కిటికీలోంచి తోసేస్తే సరి— ముసలాడు రాజమండ్రి కాదు, సరాసరి నరకానికి పోయి యముణ్ణి టికెట్ అడుగుతాడు!" అంటూ హఠాత్తుగా లేచాడు హనుమంతు లేస్తూనే సుందరం మీదకు లంఘించాడు. ఆపదను ముందుగానే ఊహించిన సుందరం ప్రక్కకు తప్పుకొని— హనుమంతు బాలన్సు తప్పి కిషన్ మీద పడగా — అతని జుత్తు దొరక బుచ్చుకొని తలను క్రిందకు బలంగా నొక్కిపట్టాడు. అదను కోసం ఎదురు చూస్తున్న మనవడు

తక్షణం లంఘించి జుత్తులాల చేతుల్ని వెనక్కి విరిచి పట్టుకున్నాడు.

ఇదంతా మెరుపు వేగంతో జరిగిపోగా అందరూ చేష్టలు దక్కి దిగ్భ్రాంతిగా వుండి పోయారు.

ఈ నాటి యువకులకు జుత్తులోనే ప్రాణం! ఆ జుత్తుని సుందరం ఉడుములా పట్టుకునేసరికి—కదిలితే మెడ విరిగేస్థితో—హనుమంతు ఒక క్షణం విలవిలలాడి, లొంగిపోయాడు. ఏరువులు మేసి సుష్టితంగా పెరిగిన జుత్తులు శరీరం— మట్టి పిసికే మనవడి మోటు చేతుల్లో కరకరలాడిపోయింది కారప్పూసలా! నోరు మెదిపితే చుట్టూ వున్న వాళ్ళు తన్నేట్టు కనిపించగా హావానరాల కిచకిచలూ, తాని తందానల పాతపాటా ఆగిపోయాయి.

అంతవరకూ నోరు తెరవని పెద అందరూ నోళ్ళు తెరిచారు. "వెధవల్ని తన్నండి... పొడవండి... కిటికీలోంచి తోసెయ్యం"డని కొందరు యువతరం ఫ్యాషన్‌లను అవహేళన చేస్తూ కొందరు, వారి క్రమశిక్షణా రాహిత్యాన్ని దుయ్యబడుతూ మరికొందరు ...

తువ్వాలుతో జుత్తులు చేతుల్ని వెనక్కి విరిచికట్టి జేబులు వెదికాడు మనవడు.

## ఆకాశ హర్మ్యాలను నిర్మించే క్రొత్త పరికరం!

జపానులోని యుటాని హెవీ ఇండస్ట్రీస్‌వారు ఎత్తయిన భవనాలను నిర్మించేందుకు సహకరించే క్రొత్త పరికరాన్ని తయారు చేసింది. ఇది అతి ఎక్కువ బరువును మోయగల ఒక క్రేన్. దీనికి పొడవైన 'చెయ్యి' వుంటుంది. ఈ చేతి పొడవు 41 మీటరు. ఇది 25 టన్నుల బరువును మోయగలదు. మోయవలసిన వస్తువును పట్టుకోడానికి యీ చేతి చివరి భాగాన్ని రకరకాల ఆకారాల్లో వుండే విధంగా తయారు చేశారు

డబ్బు కనిపించలేదు.

సుందరం రెండోసారి ఖంగు తినేసాడు. మళ్ళా వాతావరణం మారిపోయింది.

"ఇప్పుడేమంటారు? అన్యాయంగా మమ్మల్ని అవమానించారు! ఒరే పలెటూరి బైతూ! విప్పరా నా చేతులు!...ఫ్రెండ్స్! ...విజృంభించండి ... ఆ ముసలాడిని తన్నండి..." విజయ చిహ్నాలు కనిపించగానే మహోత్సాహంగా ఆజ్ఞలు జారీ చేసే సైనికాధికారిలా వున్నాడు జుత్తులు.

పరిస్థితి ఎదురు తిరిగే సరికి సుందరం పట్టు సడలింది. హనుమంతు తప్పించుకొని—ఎందుకైనా మంచిదని— దూరంగా జరిగి తనూ అరవడం మొదలుపెట్టాడు. హావానరాలూ, తాని తందానలు — ముఖాలు చూసుకుంటున్నాయి, ఏం చేయ్యాలో తోచక.

తండ్రి అనవసరంగా తల దూర్చి అవమానం పొందుతున్నందుకు కిషన్‌కి బాధగానే వుంది వర్ధనమ్మ ముఖంలో దిగులూ, ఆందోళనా. మైథిలి తల ఎత్తనే లేదు.

అప్పుడు ...

అంతవరకూ మౌనంగా కూర్చున్న యువకుడు బెర్త్ మీద నుండి కిందకు దూకాడు. "మిస్టర్! అనవసరంగా నోరు పారేసుకోకు! అతడు డబ్బు కొట్టేసి నీ జేబులో దాచడం నేను కళ్లారా చూసాను" అంటూ హనుమంతు కాలర్ దొరకబుచ్చుకున్నాడు.

స్విచ్ నొక్కినట్టు—చక్‌మని— జుత్తుల్ని వదిలేసి హనుమంతు చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు మనవడు. అలా పట్టుకోడం అతనికి బాగా అలవాటైన విద్య!






# పొగడిక - తెగడిక

లోకంలోని మనుష్యుల స్వభావం పలు విధాలుగా వుంటుంది. కొందరు తమకు ఇష్టం లేని వాళ్ళు మంచివాళ్ళయినా సరే, వారిలో లేని తప్పులను ఆరోపించి నిందిస్తూ ఉంటారు. కొందరు, తమకు ఇష్టమైన వాళ్ళను- వాళ్ళు మంచి వాళ్ళు కాకపోయినా సరే, లేని గుణాలను ఆరోపించి తెగ పొగుడుతారు కొందరు నిందించినవాళ్ళనే మరి కొందరు పొగుడుతారు కొందరు పొగడిన వాళ్ళను మరి కొందరు తెగడుతారు వేర్వేరు మనస్తత్వాలుగల మానవుల స్వభావం యిలా వుంటుంది.

తను పవర్తనపయి తనకు విశ్వాసం ఉన్న వారు తమ్ము ఇతరులు నిందిస్తే బాధ పడరు ఇతరులు తమ్ము కొనియాడితే పొంగిపోరు వారు దూషణ భూషణలు రెండింటికి అతీతులయి ఉంటారు తన సమక్షంలో తమరిని పొగడినప్పుడు సిగ్గుతో తల వంచుకొంటారు ఇలా ఉండడమే ఉత్తమ లక్షణం కూడా కాని యిలా ఉండేవారు చాలా తక్కువగా మాత్రమే కానవస్తారు. నిస్సంగులు కూడా, ఈ నిందాస్తుతులకు లోనయిపోయి, రాగద్వేషాలను [illegible]డినూ ఉండడం కలదు.

ఈ విధంగా నిందను, స్తుతిని లెక్క చేయకుండా ఉన్నా, వీటివల ఒకానొకప్పుడు మేలు కలగడానికి అవకాశం వుంది చెడ్డదాని వల ఒకప్పుడు మేలు కలుగుతుంది. మనిషి చంపే పాము విషం ఒకప్పుడు మందులో ఉపయోగపబడి ప్రాణ రక్షణను కలుగ చేస్తుంది. "విషమప్యమృతం క్వచిద్ భవేత్" అని విషం కూడా ఒకప్పుడు అమృత మవుతుందని పెద్దల వాక్యం. మనల్ని విపరీతంగా నిందించినప్పుడు- వారా నిందలో పేర్కొన్న అవగుణాల మనకు తెలుస్తాయి. అప్పుడు అట్టివి మనకు చేరకుండా జాగ్రత్త పడడానికి అవకాశం వుంటుంది ఒకడు పొగడినప్పుడు కూడా ఆ పొగడ్తలో ఉండి, మనలో లేని మంచి గుణాలను అలవరచుకొనుటకు ప్రయత్నించాలనే సంకల్పం కలుగుతుంది

ఉత్తములు, తమన్ని ఎవరైనా నిందించినా, ఆ నిందను లెక్క చేయక, ఆ నిందలోని అవగుణాల తనకు కలుగకుండా ఉండుటకు అన్ని విధాల పయత్నించాలి 

[కులపతి, మాస్టర్ ఇ. కె. గారు తమ శిష్యుని ప్రశ్నకిచ్చిన సమాధానం ఆధారంగా]

---

హనుమంతు జేబులో రెండు వంద రూపాయినోట్లు దొరికాయి. "అది మీ డబ్బని రుజువేమిటి ?" యింకా దబాయిస్తున్నాడు హనుమంతు.

అవి దొరకగానే ఆ నోట్లను దేవుడి పటం ముందుంచి ముసలమ్మ పూజ చేసింది. నోట్ల కొనలకు చిన్న పసుపు బొట్లు పెట్టింది. నోట్ల వెనుక మనవడు శ్రీరామ అని రాసాడు.

నోట్లమీద ఆనవాళ్ళు సరిపోయాయి. డబ్బు, జాతకాలు వద్ద నున్న టిక్కట్లూ ముసలమ్మ కిచ్చేసాడు యువకుడు. సుందరం జేబులోంచి కొట్టేసిన పాతిక రూపాయలు కూడా హనుమంతు జేబులోనే దొరికాయి.

జాతకాలు టికట్ చూపించగానే సుందరాన్కి అనుమానం కలిగింది- ఎవరివో కొట్టేసాడని. కాని బయట పెట్టడం ఎలా?

## యువతరం కదిలిందా?

చీకట్లో గుడ్డిలాట వలె మొండిగా విజృంభించి చివరకు విజయం సాధించాడు.

పావుగంట క్రితం వరకూ జాతకాలు మనోనేత్రం ముందు బ్రాందీ సీసాలు, జైమాలినులూ నాట్యం చేస్తూనే వున్నాయి. రాజమండ్రిలో స్నేహితులతో జల్సా చేద్దామనుకుంటే కథ అడ్డం తిరిగింది బింకం సడలిపోగా - ముసలి పీనుగ తనని పోలీసులకు అప్పజెప్తాడేమోనన్న భయంతో - బిక్క మొగం వేసాడు.

ముసలమ్మ నమస్కారాలు పెట్టేస్తూ సుందరాన్ని పొగడివేస్తున్నది వర్ధనమ్మ భర్తవైపు మురిపెంగా చూసింది కిషన్‌కి తండ్రిని చూస్తే గర్వంగా అనిపించింది యిప్పుడు. మైథిలి—యువతికి — సగర్వంగా తల ఎత్తింది.

రాజమండ్రి స్టేషన్ ...

జాతకాల్ని, హనుమంతుని పోలీసులకు అప్పజెప్పాలనుకున్నాడు సుందరం. కాని వద్దని ముసలమ్మ బతిమాలింది. బ్రతుకు జీవుడా అని బయట పడ్డారు వాళ్ళు.

"సారీ డాడీ ! నేను మీకు కనీసం మోరల్ సపోర్ట్ అయినా యివ్వలేక పోయాను" అన్నాడు కిషన్ తల వంచుకుని.

"డోంట్ వర్రీ, మై బోయ్ !" ఆప్యాయంగా కొడుకు భుజం తట్టాడు సుందరం.

స్టేషన్ బయట ఎదురుగా "యువతరం కదిలింది" సినిమా పోస్టర్ కనిపించింది.

రిక్షా బేరం ఆడడం మరిచిపోయి ఆలోచనలో పడ్డాడు సుందరం.. యువతరం నిజంగా కదిలిందా ? కదిలితే, ఏటువైపు ? మంచి వైపా ?... చెడు వైపా ?! ...

# ఇప్పుడు! ప్రపంచ ప్రసిద్ధమైన పసిమిచాయ రహస్యం ఇండియాలో!



ప్రత్యేక దినుసు చర్మానికి తేటను.
పసిమిచాయను తెస్తుంది-ప్రకృతి సిద్ధంగా.

శాస్త్రీయమైన సూత్రం మచ్చల్నీ.
కళంకాల్నీ తొలగిస్తుంది.

మేలైన సూర్యకవచం చర్మం
నల్లబడటాన్ని అరికట్టుతుంది.

సమృద్ధిగా చెమ్మనిచ్చే పదార్థం
చర్మాన్ని మృదువుగా చేస్తుంది.

## పరిపూర్ణమైన పసిమిచాయ క్రీం

ప్రపంచమంతటా వివిధ దేశాలలో లక్షలాది సుందరులు క్రమంతప్పకుండా వాడుతున్నారు, **క్లియర్-టోన్**.

అంతర్జాతీయ ఔషధ శాస్త్రపరిశోధనా ఫలితమైన ఈ శాస్త్రబద్ధమైన పసిమిచాయ సూత్రీకరణను నికోలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్ వారు మీకందిస్తున్నారు.

అంతర్జాతీయ స్వీకరణ పొందిన సూత్రం **క్లియర్-టోన్** మీ చర్మానికి తేటను పసిమిచాయను తెచ్చేందుకు. ఇండియాలో లభించే మరే యితర క్రీంలోనూ లేని ఒక ప్రత్యేక దినుసు కలిగి ఉంది.

**క్లియర్-టోన్** క్రీం మీ చర్మానికి మరింత పసిమిచాయను తెచ్చేందుకు, మచ్చల్నీ కళంకాల్నీ తొలగించేందుకు ప్రకృతి సిద్ధంగా పనిచేస్తుంది. అందులోని శాస్త్రీయ సూత్రీకరణ హాని కలిగించే అల్ట్రావయొలెట్ కిరణాల నుండి మీకు రక్షణ కలిగించి, మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది. అంతేకాదు. **క్లియర్-టోన్** మీ చర్మాని కవసరమైన చెమ్మను అతి సున్నితమైన పద్ధతిలో ఇస్తుంది. ఆలేశామీకై మీరే చూడండి. **క్లియర్-టోన్** క్రమం తప్పకుండా వాడండి, మరి 6 వారాల్లో దాని ఫలితాల్ని చూసి వళ్లు పులకరించి పొండి.

ప్రపంచమంతటా
ప్రఖ్యాతిచెందింది






## పసిమిచాయ రహస్యం-ప్రకృతి సిద్ధంగా

లండన్. పారిస్. న్యూయార్క్.

daCunha/NICL/3/81-TL



సీరియల్

(గత సంచిక తరువాయి)

అలాటి సమయంలోనే వెంకటరత్నం మీటింగుల కెళ్ళాలి అని చెప్పాడు. ఆరోజు సాయంత్రం వంట ముగించి, దీపాలు తుడిచి వెలిగించింది.

దమయంతి చదువుకుంటోంది. కళ్యాణి తెలిసిన వాళ్ళ ఇంటికెళ్ళి ఇంకా రాలేదు. సత్యవతమ్మ గిరిజకు తలచిక్కు తీస్తున్నది. తార పుట్టింట్లో ఉండగా నాగరత్నమ్మ ఎప్పుడూ అంటుండేది —

"సంధ్య దీపం వెలిగించే సమయంలో తల దువ్వకూడదు, ఇల్లు ఊడవకూడదు" అని. తారను చేయనిచ్చేది కాదు. కాని అత్తగారింట్లో మాత్రం ఎక్కువగా ఆ సమయంలోనే పిల్లలకు తల దువ్వుతుంది సత్యవతమ్మ. ఒకటి రెండు సార్లు యధాలాపంగా తార అన్నది. కాని, ఆమె నవ్వేసి ఊరుకుంది. 'అవును' అనలేదు, 'ఆఁ — ఏం లేదులే' అనీ అనలేదు; ఆపనీ మానలేదు.

తార నెమ్మదిగా అత్తగారి ప్రక్కకువెళ్ళి అతి మెల్లిగా, వినయంగా అడిగింది— "ఆయన బెజవాడలో జరిగే మీటింగులకు నన్ను రమ్మంటున్నారు. వెళ్ళమంటారా ?"

ఛ్రుమన్నాది సత్యవతమ్మ.

అయినవీ, కానినీ ఏవేవో అన్నది.

'నిన్ను శాసించటానికి నేనెవర్ని' అంది.

'పెళ్ళాం వస్తే ఆ రాజకీయాల గొడవలుమాని కుదురుగా ఇంట్లో ఉంటాడనుకుంటే ఏమీ తెలియని మొద్దు రాచిప్ప ఒకటి వాడికి దొరికింది! వాణ్ని మాన్పించటం పోయి తానే వెళ్తుందిట! వెళ్ళండి! వెళ్ళి దేశాన్ని ఉద్ధరించండి!' అంది.

'అమ్మా అబ్బా ఏమై పోయారో ఏమో, మళ్ళీ అంతులేరు. సరైన దార్లో పెట్టి పెంచితే ఇలా ఎందుకు తయారవుతారు ?' అంది.

"సరిగ్గా పట్టవే" అంటూ గిరిజ నెత్తిన ఒక్కటిచ్చింది తక్కున.

"ఒదినమీద కోపంగా ఉంటే ఆవిడ్నికొట్టు మధ్యలో నన్ను కొడతావెందుకు ?" కయ్యిమంది గిరిజ.

తార నోరు తెరవలేదు.

వెనుక వరండాలో ఒక ప్రక్కగా స్తంభానికి ఆనుకొని కూర్చుండి పోయింది.

సత్యవతమ్మ ఆన్ చేసి వదిలిన రేప్ రికార్డులా వాగుతూనే ఉన్నది.

వెంకట్రామయ్యగారు వచ్చారు. భర్తకు అన్నం పెట్టటానికి లేచింది సత్యవతి. గొణుగుతూనే వంటగదిలోకి వెళ్ళింది.

ఆ వెనకాలే వెంకటరత్నం వచ్చాడు. అతడి రాకను గమనించలేదు సత్యవతి. ఆవిడ ధోరణిలో ఆవిడ సణుక్కుంటూనే ఉన్నది.

చిరుబురులాడుతున్న భార్యను చూడగానే వెంకట్రామయ్యగారికి అరికాలిమంట నెత్తికెక్కింది.

"ఏం జరిగింది ?" కోపంగా అడిగారు.

"ఏం జరగాలి ? ఇంట్లో ఏం జరుగుతున్నదో మీకు తెలుస్తోందా ? ప్రొద్దుటా సాయంత్రమూ హోటలు కొచ్చినట్లుగా ఆ టైముకు రావటమూ, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మళ్ళీ అర్జంటుగా వెళ్ళిపోవటమూ ! ఏం జరుగుతోందో మీకేం తెలుస్తుంది ?"

వచ్చి పీటమీద కూర్చోబోతున్న వెంకట్రామయ్యగారు చివ్వున తలెత్తి భార్య వంక చూస్తూ కఠినంగా అడిగారు —

"ఇపుడు నీకేం కష్టం వచ్చింది. తిని కూర్చుంటే అరక్క కొట్టుకు ఛస్తున్నావు కాని"

"అవును, అరగకే అరుస్తున్నాను. మంచీ, మర్యాదా లేకుండా మొగుడితో కలిసి మీటింగుల కెళ్తుందిట కోడలు పిల్ల ! దాన్ని అడగండి ! తిండి అరక్క వెళ్తున్నాదో, పొగరెక్కి వెళ్తున్నాదో చెబుతుంది !"

గదిలో బట్టలు మార్చుకుంటూన్న వెంకటరత్నం ఉలిక్కి పడ్డాడు. భార్య వైపు చూసాడు. రాని నవ్వును బలవంతాన పెదవుల పైకి పులుముకుంటూన్న భార్యను ప్రేమగా భుజాల చుట్టూ చేయి వేసి 'ఏం ఫర్వాలేదులే' అనే భావం స్ఫురించేట్లుగా తట్టాడు.

ఆ స్పర్శ తారకెంతో ధైర్యం ఇచ్చింది. అంతే గాక అది అభయమిస్తూన్న అద్భుత హస్తంలాగా అనిపించింది.

వెంకటరత్నం వంటగదిలోకి వచ్చాడు. కొడుకుని చూడగానే సత్యవతమ్మ నోరు తక్కున మూసుకున్నది.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

కొడుక్కి కూడా వడ్డన చేసింది.

* * *

రేపే మీటింగులు మొదలు.

రాత్రి మరోసారి గుర్తుచేసాడు వెంకటరత్నం. "ఉదయం లేస్తూనే త్వరగా బట్టలవీ సర్దిపెట్టు. వీలైతే నేను భోజనానికి వస్తాను. లేకపోతే వెంకటేశ్వర్రావు వచ్చి స్టేషనుకు తీసుకొస్తాడు." అన్నాడు.

చటుక్కున అన్నది తార —

"ఉహుఁ — అలావద్దు. నేను అతనితో రాను. ఆ సమయానికి అత్తయ్య ఏమంటారో, ఏమో! మీరు తీసుకెళ్తేనే వస్తాను. ఎవరు వద్దన్నా, రావటానికి నేను సిద్ధమే. కాని, మీ వెంబడి మాత్రమే వస్తాను."

తార కంఠంలోంచి స్పష్టంగా వినిపిస్తూన్న దృఢ నిశ్చయానికి కించిత్ నివ్వెరపోయినా 'అలాగేలే' అన్నట్లు తల ఊపుతూ చిరునవ్వుతో భార్య నడుం చుట్టూ చేయి లేసాడు.

మరునాడు స్నానంచేసి వీధిలోకి వెళ్ళేముందు వంటగది దగ్గరకు వచ్చాడు. అక్కడ సత్యవతమ్మ లేదు. చేతి నిండా పనితో తార ఒక్కర్తే సతమత మవుతున్నది.

"అమ్మేది ?"

"తెలియదండీ. బహుశా ముందు వరండాలో ఉన్నారేమో !"

నిజమే! ఆరోజు ఆదివారం! ఆడపిల్లలిద్దరకూ తలలకు నూనెరాసి చిక్కు తీస్తున్నాది ముందు వరండాలో.

చెప్పులు వేసుకుంటూ తల్లితో అన్నాడు — "అమ్మా! రేపు మీటింగుకు తారను కూడా తీసుకెళ్తున్నాను. మధ్యాహ్నం ఒంటి గంట బండికి వెళ్తాము."

"నేను కూడా రానా అన్నయ్యా ?" అడిగింది కళ్యాణి.

"రా" అనేసి వీధిలోకి వెళ్ళిపోయాడు. సత్యవతమ్మ కయ్యిమంది.

**జరిగిన కథ — 7** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ—రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం. కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు వెంకటరత్నం. శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార. భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతోపాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార. బెజవాడలో జరగబోతున్న మీటింగులకి వెళ్దాం రమ్మని తారకు ఉత్తరం ద్వారా తెల్పుతాడు వెంకటరత్నం. తండ్రి వెళ్ళొద్దని వారించినా వినక ఎన్నో బాధలకోర్చి అతన్ని కలుసుకొంది తార. రాఘవయ్య నిరాదరణతో వెంకట్ వెంట వచ్చిన తార అత్తగారింటి పరిస్థితుల్ని అవగాహన చేసుకుంటుంది.

''నువ్వెక్కడికే ?'' కూతుర్ని కసిరింది.

''పో! నీయిష్టమేమిటి! నేవెళ్తాను!... ... ఒదినా, ఒదినా'' అంటూ లోపలికి వెళ్ళింది.

వంటపని అయిపోయింది. స్నానం చేసి మంచి చీర కట్టుకుంది. కళ్యాణి కూడా తయారయింది. తార ముగ్గురివీ బట్టలు సర్దుతున్నది. సత్యవతమ్మ మనసు కుతకుతా ఉడుకుతున్నాది. పిల్లి మీద పెట్టీ, ఎలుక మీద పెట్టీ సాధిస్తూనే ఉన్నది. ఉండీ, ఉండీ గిరిజకూడా ఏదో ఒక వంకర మాట అంటూనే ఉన్నది.

వెంకట్రామయ్యగారు భోజనానికి వచ్చారు.

మళ్ళీ మొదలు పెట్టింది సత్యవతమ్మ. నిజానికి వారికూడా మీటింగుకు వెళ్ళటం వెంకట్రామయ్య గారికీ ఇష్టంలేదు. అందుకే సత్యవతమ్మ గొడవంతా )ంటూ' ఊరుకున్నారు. అది చూచాయగా గ్రహించ ుట్టే సత్యవతమ్మకు కూడా ఇన్నిసార్లు రెట్టిం ేందుకు ధైర్యం వచ్చింది.



''ఏడీ వాడు ?'' ప్రశ్నించారు.

''లేదు, బయటకు వెళ్ళాడు. అయినా అట్లా ుళ్ళో దేవుడు లాగా మాట్లాడరేమిటి ? 'వీల్లేదు, ీసుకెళ్ళొద్దు' అని గట్టిగా చెప్పలేరా ?''

భోజనం ముగించి ముందు వరండాలోకి వచ్చారు. రోజులాగా వెళ్ళిపోవటానికి సిద్ధపడకుండా కొడుకు కోసం కాబోలు ఎదురుచూస్తూ వాలు కుర్చీలో కూర్చున్నారు. మరో అరగంట దాటాక వచ్చాడు వెంకటరత్నం.

భోజనాలు అయిపోయాయి !

వెంకటేశ్వరరావూ, శ్రీనివాసరావూ వచ్చి వరండాలో నిలబడ్డారు.

వెంకట్రామయ్యగారు లోపలకు వచ్చారు. 'ఏం అడిగితే ఎలా ఎదురు చెబుతాడో' అని ఆయన ఆలోచిస్తున్నారు.

ఈలోపున సత్యవతమ్మ మళ్ళీ సణిగింది. వినిపించుకోలేదు వెంకటరత్నం. అతడికి వినపడే ట్లుగా అనే ధైర్యం ఆమెకు లేదు ! ఆమె సణుగుడు పట్టించుకునే అలవాటు వెంకట్‌కు లేదు ! తండ్రితో చెప్పి భార్యనూ, చెల్లినీ తీసుకుని వెళ్ళిపోయాడు.

వెంకట్రామయ్యగారు అలా చూస్తూనే ఉన్నారు. అది ఇంకా కోపాన్ని పెంచింది – ''వాడు వెళ్ళొస్తానని చెబితే అట్లా తలూపక పోతే 'వీల్లేదు వెళ్ళొద్దు' అని అనలేరూ ! కొడుకుని ఆ మాత్రం గద్దించ లేరూ! మీ అలుసు చూసుకుని కాదూ వాడా ఆటలు ఆడుతున్నది.'' అని ఆ సాయంత్రం దాకా అరుస్తూనే ఉంది.

* * *

సరళ భర్త ప్రకాశరావుకి అత్తగారింట్లో మర్యాదలు ఎక్కువై సరిగ్గా ఉద్యోగంలోకి వెళ్ళక పోవటంతో అతడికి నాలుగైదుసార్లు వార్నింగులు ఇచ్చారు. అయినా లాభం లేకపోయింది. ఇంక ఆ శుభముహూర్తాన ఆ ఉద్యోగం కాస్తా పోయింది.

రాఘవయ్యగారికి కోపం.

'పెద్ద అల్లుడు చూస్తే అట్లా ! అతనొక మొండి ! ఎవరు చెప్పినా వినడు ! అసలు ఇతరులకు చెప్పే అవకాశమే ఇవ్వడు! అందర్నీ ఆమడ దూరంలో ఉంచే రకం ! ఇహ ఈ రెండో అల్లుడు ఇట్లా! ఏరికోరి చేసినందుకు ఏదో సామెత చెప్పినట్లుగా

# ప్రేయసి మెచ్చిన చీరే మరి చీర




## 100% పోలియెస్టర్ మరియు వాయిల్ చీర

Navnit 238/81

• నాజియా • రేశ్మా • నూరహాన్ • సిల్కి-షిఫాన్ • హీనా • జిన్నత్
• రజియా • శబ్నమ్ • రీనా • డయానా • శబానా • పూనమ్
• లా-ఇంటిమేట్ • సిల్మోర్ • వైకాట్ -2 • టెరీఫిల్ షిఫాన్
• సిల్కో-సా • టెక్సాఫిల్.




బాలక్రిష్ణా టెక్స్‌టైల్స్ ప్రైవేట్ లిమిటెడ్ నరోల్ (అహ్మదాబాద్)

ప్రకృతి ప్రసాదించిన మహత్తర కానుక ప్రత్తి అందులోనుంచి దారాన్ని తీసింది మానవుడు. సాధించిన ఘనత అపూర్వం. ఆ రెండింటి అందమైన కలయికకు ఫలం బాలక్రిష్ణావారి 'మేనక' చీర. వెల్వెట్‌లా మెత్తగా చెప్పనలవికాని డిజైన్లలో

మేనక
—ప్రకృతితోనూ, వస్త్ర సాంకేతిక శాస్త్రంతోనూ, ఒకటై, ఏకమై.

ఉంది వీళ్ళ ప్రవర్తన!' విసుక్కునే వారు రాఘవయ్యగారు.

పెద్ద అల్లుడు ఏంచేసినా, ఎలా చేసినా అతడితోనే సరిపెట్టుకుంటున్నాడు. ఈ చిన్న అల్లుడు అలాచేయటం లేదే! ప్రతి కొరివినీ తెచ్చి 'మామ' తలకే చుడుతున్నాడు.

ఎంత విసుక్కున్నా తప్పదు! అతనికేదో దారి చూపించాలి కదా! అతనికేం పట్టనట్టు, చిమ్మకు నీరెత్తినట్టుగా కూర్చున్నాడు ఇంట్లో! పెళ్ళి అయింది, భార్య ఉంది, ఇంకొన్ని నెలలలో తండ్రి కూడా అవుతాడు! అయినా బాధ్యత మాత్రం రాలేదు.

రాఘవయ్యగారి దృష్టిలో ఇదొక మహానేరం!

నాగరత్నమ్మ దృష్టిలో ఇంకా కుర్రతనం!

సరళ దృష్టిలో కలిసి రావటం లేదు!

'ఏదో ఒకదారి తానే చూపెట్టాలి' అనుకున్న రాఘవయ్యగారు తనే పెట్టుబడిపెట్టి ఇత్తడి సామానుల కొట్టు ఒకటి తెరిచారు. దానిలో ప్రకాశరావుని నియమించి బాగా చూసుకోమని హెచ్చరించారు.

నాలుగైదు నెలలు అయ్యాక 'వ్యాపారం ఫర్వాలేదు. బాగానే ఉంది' అన్పించింది. రాఘవయ్య గారు 'అల్లుడు దారిలోపడ్డాడు' అని సంతోషించారు.

కొట్టును అభివృద్ధి చేసారు.

నాగరత్నమ్మకు ఆరోగ్యం దెబ్బతింది. ప్రతిరోజూ గుడివాడ హాస్పిటల్‌కు వెళ్ళి వస్తూన్నది. పిల్లలు కూడా చదువుల కోసం రోజూ గుడివాడకు వస్తున్నారు. ప్రకాశరావు సరేసరి! ఇన్నీ ఆలోచించి రాఘవయ్యగారు కాపురం గుడివాడకు మార్చేసారు. ఆ రోజుల్లోనే పెద్దకూతురు అత్తగారింటినుండి చాకలి శుభలేఖలు తెచ్చాడు. పెద్ద ఆడపడుచు గిరిజ పెళ్ళి శుభలేఖ అది! ఇంకా వాళ్ళమీద కోపం తగ్గని రాఘవయ్యగారు తనూ వెళ్ళలేదు, ఎవరినీ పంపనూలేదు.

కాపురం గుడివాడకు వచ్చాక ప్రకాశరావు 'వేరే ఇల్లు తీసుకుంటాము' అన్నాడు.

'అదీ మంచిదే! బాధ్యతలు తెలుస్తాయి!' అనుకున్న రాఘవయ్యగారు సంతోషంగా ఒప్పుకున్నారు.

అలా సరళ స్వంత కాపురం మొదలైంది, ఆ గుడివాడలో.

ప్రకాశరావుకు చిన్నప్పట్నుంచీ ఉన్న మరో

# తార

సరదా – నాటకాలు! ఇపుడు కాపురమే గుడివాడకు మార్చటంతోనూ, వేరు కాపురం పెట్టటం కోసూ ఆ సరదాకు ఆటంకం అనేది లేకుండాపోయింది. దాంతో సరదా కాస్తా వ్యామోహంలోకి దిగింది. సాయంత్రం ఆరుగంటలకల్లా ఆఫీసు మూసినట్లుగా కొట్టు మూసేసి నాటకాల కంపెనీకి వెళ్ళిపోయేవాడు!

*   *   *

కమ్యూనిస్టుపార్టీ తీవ్రరూపం దాల్చింది! ఆ ఊరిలో అనేక రకాల పార్టీలు ఉన్నాయి! 'కమ్యూనిష్టులం' అని చెప్పుకునేవారూ చాలామందే ఉన్నారు! కానీ, వెంకటరత్నం చర్యలలోని నిజాయితీ ఇంకెవ్వరిలోనూ కనిపించేదికాదు! అతడిలోని 'తీవ్రత' మరెవ్వరిలోనూ ఉండేదికాదు!

ఉడుకురక్తం! ఆవేశం ఎక్కువ!

పగలు ఆఫీసు! సాయంత్రం పార్టీ కార్యక్రమాలు! ఇంక ఏ రాత్రికో ఇంటికి చేరుకునేవాడు! మళ్ళీ తెల్లవారగానే ముంచుకొస్తున్నట్లుగా పరుగెత్తేవాడు! గడియారంతో సమంగా పనిచేస్తున్నట్లుగా ఉండేవాడు!

'ఒక్కగానొక్క కొడుకు! ఇలా ఇల్లు పట్టకుండా తిరుగుతున్నాడు! సంపాదించకపోతేపోనీ, కనీసం ఉన్నదయినా నిలుపుకునేట్లు లేడే' అని మధనపడేది మాతృహృదయం! అట్లా అట్లా ఆలోచించి మనసంతా పాడుచేసుకునేది! కొడుకునేమీ అనలేక ఆ బాధ తీరేవరకూ, ఆ కోపం పోయేవరకూ కోడలిపైన అరుస్తుండేది!

వాడు చాలక ఈ కళ్యాణి ఒకర్తె నా ప్రాణానికి! ఇదికూడా పార్టీలంటూ, మీటింగులంటూతిరుగుతున్నాది! "వాడంటేమగాడు! ఎట్లాగో తిరుగుతాడు! కానీ, నువ్వు? నువ్వు ఆడపుటక పుట్టావే దౌర్భాగ్యురాలా! వాడి మాదిరిగానే నువ్వూ తిరగాలంటే నీకెట్లా వీలవుతుందే! అవ్వ! ఈ తిరుగుళ్ళూ, ఈ గొడవలూ బయట తెలిస్తే – రేపసలు నీకు పెళ్ళంటూ అవుతుందా!" అని తిట్టిందొకసారి. కళ్యాణి అది వింటూనే కయ్యిమంది. మళ్ళీ తన జోలికి రాకుండా ఉండేట్లుగా పోట్లాడింది. అది జరిగాక నిజంగానే సత్యవతమ్మ కళ్యాణిని ఏమయినా అనాలంటే వెనుకాడుతోంది.

ఏదో పనిమీద ఊరు వెళ్ళాడు వెంకటరత్నం. వారం రోజుల్లోనే వచ్చేస్తానని చెప్పి వెళ్ళినవాడు పదిరోజులు పైగా అయింది. ఇంకా రాలేదు. అందరూ ఖంగారుగా ఎదురుచూస్తున్నారు ఆ సమయంలో శ్రీనివాసరావుతో ఒక కబురు పంపించాడు వెంకటరత్నం.

'బెజవాడలో బ్రిటన్ కమ్యూనిష్టు పార్టీ లీడర్ రజనీ పామీదత్‌గారివి మీటింగులున్నాయిట. తారను రమ్మని' కబురు చేసాడు.

శ్రీనివాసరావు రాగానే వెంకటరత్నం క్షేమ సమాచారాలు విని సంతోష పడిన సత్యవతమ్మ మాతృహృదయం – అతడు పంపిన కబురు వినగానే భగ్గున మండింది.

తిట్టింది! అరిచింది! పోట్లాడింది! చివరకు ఏడ్చింది కూడాను!

అంత పెద్దావిడ అలా బాధపడుతుంటే తార కూడా ఏడ్చేసింది. 'ఆవిడ తన పట్ల ఎలా ప్రవర్తించినా – వెంకటరత్నం గూర్చి ఆవిడ బాధ పడటంలో అన్యాయం లేదనిపించింది. తల్లిమనసు! కొడుకు బాగోగులు కోరే మనసు! కొడుకు కోసమైనా కోడలి క్షేమం కోరే మనసు! తమ కోసమే ఆవిడ అంతగా బాధ పడుతున్నాది' అనుకుంటే ఆవిడపట్ల తార హృదయం ప్రేమతోనూ, జాలితోనూ నిండి పోయేది.

'ఛా! తల్లి మనసును క్షోభపెట్టటం మంచిది కాదు!' అనుకునేది.

కాని, ఒకవైపున వెంకటరత్నం ఆజ్ఞ! అతను ఎదురుగా అయినా ఉంటే ఎలాగో చెప్పి ఒప్పించే అవకాశమయినా ఉండేది. కాని, ఇలా కబురు చేయటంతో వెళ్ళకపోతే ఎంతకోపం తెచ్చుకుంటాడో, ఏమిటో అని భయపడిపోతున్నాది. ఎటూ తేల్చుకోలేక సతమతమవుతూన్న సమయంలో కళ్యాణి ముందరకు వచ్చింది.

"అమ్మ అలాగే ఏడుస్తుందిలే ఒదినా. పద వెళ్దాం" అంది.

ఇంక ఉండబట్టలేకపోయింది సత్యవతి– "ఇంక నుండీ ఇలాంటి మీటింగులకంటూ ఈ వెధవ తిరుగుళ్ళు తిరగటానికి ఈ ఇంట్లోంచి వెళ్ళబోకు. మీ పుట్టింటికెళ్ళి అక్కడ్నుంచీ ఎక్కడికేనా వెళ్ళు! ఏమైనా చెయ్యి! నీ యిష్టమొచ్చినట్లూ, మీ ఆయనిష్టమొచ్చినట్లూ ఏ తైతక్కలేనా ఆడండి!








విజయవాడ కార్టూనిస్టులు ఇటీవల నిర్వహించిన మూడవ కార్టూన్ల పోటీ సందర్భంగా ఏర్పాటు చేసిన కార్టూన్ల ప్రదర్శనని తిలకిస్తున్న నగర మేయర్ శ్రీ టి. వెంకటేశ్వరరావుగారిని చిత్రంలో చూడవచ్చు.

నాకేమి! అదేదో మీ అబ్బా, అమ్మా చూసుకుంటారు!'' అని అరిచింది.

హతాశురాలయింది తార.

'మరొక పది రోజులకు పెళ్ళి అయి మూడేళ్ళూ నిండిపోతాయి! అసలు తనను వాళ్ళంతా చచ్చిపోయిన దాని క్రింద జమకట్టి మర్చిపోయారేమో! లేకుంటే తనపట్ల అంత ప్రేమగా ఉండే నాన్నగారు— 'నువ్వెళ్ళిపోతే నేనీ ఇంట్లో ఉండగలనా తల్లీ' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్న నాన్నగారు కనీసం ఒకసారి రాలేదు సరికదా ఒక్క ఉత్తరం అయినా వ్రాయలేదు.'

'ఈ కోప తాపాలన్నిటికీ కారణం ఈయనగారే! ఈయనకున్న ఈ పార్టీ పిచ్చి మూలంగానే అటు పుట్టింటికి దూరమయ్యాను! ఇటు అత్తగారింట్లోనూ అవమానంపాలు అవుతున్నాను' అనుకుంది.

* * *

సరళ భర్త ప్రకాశరావుకి నాటకాల పిచ్చి ఎక్కువైపోయింది. అది క్రమంగా సినిమాల్లో జేరిపోవాలనే ఆశ క్రిందికి మారింది. ఒక్కోసారి ఎవరకూ చెప్పకుండా కొట్లోని సామానులు అమ్మిన డబ్బుతో మద్రాసు వెళ్ళిపోయేవాడు. ఆ వెళ్ళటం వెళ్ళటం ఇరవై రోజుల వరకూ వచ్చేవాడు కాదు! ఇంట్లో చంటిబిడ్డ! పైగా మళ్ళీ గర్భం!

పాపం! సరళ చాలా బాధపడిపోయేది. బాబుని తీసుకొచ్చి తల్లి దగ్గర వదిలేది! రాఘవయ్యగారు విసుక్కుంటుండేవారు. "నెలలో ఇరవై రోజులకు పైగా కొట్టు మూసేస్తే వ్యాపారం ఎలా సాగుతుంది'' అని సరళను తిట్టేవారు.

ఆ అమ్మాయి మట్టుకు ఏం చేయగలుగుతుంది?

ఏడుస్తుంది!!

* * *

ఇప్పుడు తార నాలుగో మాసం గర్భవతి! అసలే సన్నగా ఉండే తార ఇప్పుడు మరీ పుల్లలాగా అయిపోయింది. ఆ ఇంట్లో వెంకటరత్నం అందించే అనురాగమే తారకు గొప్ప టానిక్! అతడు ఆ ఇంట్లోంచి బయటకు వెళ్తే — తర్వాత 'అన్నం తిన్నావా ?' అని అడిగేవాళ్ళు కూడా ఉండరు.

వెంకట్రామయ్యగారి తమ్ముడు ఆ ఇంటి ప్రక్కనే ఉండేది. ఆయన భార్య సూర్యావతి. ఆమెకు

# తార

తార అంటే చాలా ఇష్టం. ఆ దంపతులకు ఒక్కతే కూతురు కొడుకుల్లేని వాళ్ళకు వెంకటరత్నంపైన ఎనలేని మమకారం! అంతేకాకుండా భార్యాభర్తలిద్దరూ కూడ కమ్యూనిస్టు పార్టీ అభిమానులు! ఉత్త అభిమానమే కాకుండా ఆయన అన్నగారికి తెలియకుండా చాటుమాటుగా పార్టీకి చాలా సహాయం చేసేవాడు! చాలా దూరంలో మీటింగులు జరిగేటప్పుడు 'వెళ్ళినా తెలియదులే' అనుకున్నప్పుడు వాటికి కూడా హాజరయ్యేవారు. ఆ కారణాలతోటి వెంకటరత్నం కూడా వాళ్ళంటే అభిమానంగా ఉండేవాడు.

కేవలం పార్టీ అభిమానమే కాకుండా, వాళ్ళ మనసుల్లో దాగి ఉన్న మమతను గ్రహించిన తార వాళ్ళ పట్ల గౌరవంగానూ, ఇష్టంగానూ ప్రవర్తించేది.

సత్యవతి గిరిజను తీసుకుని పుట్టింటివారిని చూసి వచ్చేందుకు అంగలూరు వెళ్ళింది. కళ్యాణి గుడివాడ వెళ్ళింది. వెంకటరత్నం భోజనానికి వస్తాడో రాడో కూడా తెలియదు. అసలు ఆ పొంద్రికి వెళ్తున్నాడో, లేదో కూడా తారకు తెలియదు. వెంకటరత్నం ఇంట్లోలేని సమయాల్లో తీరిక దొరికినపుడల్లా అతడి గురించి ఆలోచిస్తూ అనుకునేది — 'ఈసారి ఆయన రాంగానే కొంచెం పోట్లాడాలి! మనకు పిల్లలు కూడా పుట్టబోతూంటే ఇంకా బాధ్యతలు లేకుండా ఎపుడూ మీటింగులు, మీటింగులంటూ పార్టీకోసం ఊర్లవెంబడి తిరుగుతూనే ఉంటే ఎలాగ!' అని చెప్పాలని అనుకునేది.

తీరా అతను ఇంటికి రాగానే, అతడ్ని చూడంగానే అన్నీ మర్చిపోయేది! నీలి ఆకాశపు అంచులను చూసి మైమరచి నృత్యాలుచేసే నెమలి లాగా అతడ్ని చూస్తూనే ఆమె గుండె లయ తప్పేది! ఆమె మనసు విహంగమై ఎగిరేది! అప్పటివరకూ ముసురుకున్న ఆలోచనలూ, చేసుకున్న నిర్ణయాలూ అన్నీ — అన్నీ మర్చిపోయేది! అలసి వచ్చిన అతడిని చిరునవ్వుతో ఆహ్వానించేది! అప్పటి వరకూ ఎంతో కోపంగ ఆలోచించి అతడు వచ్చాక, అతన్ని చూసి నవ్వకూడదనీ, మాట్లాడకూడదనీ, అసలు అతనివేపే చూడకూడదనీ, బెట్టుగా

ఉండాలనీ — ఎన్నెన్నో అనుకునేది. కాని, అతను గదిలోకి అడుగుపెట్టగానే తలెత్తి అతడి ముఖంలోకి చూస్తూ మధురంగా నవ్వేది! చెమటతో తడిసిన నుదురు పయటచెంగుతో తుడుస్తూ "ఇంతసేపు భోజనం లేకుండా ఉంటే ఆరోగ్యం పాడవదూ!'' అని లాలనగా, ప్రేమగా అనేది.

"అసలు మీకు 'ఆకలి' అనేదే తెలియదా ?'' అని ఆప్యాయంగా మందలించేది.

"గమ్మత్తుగా ఉంది తారా! గడపలో కాలు పెడుతూన్నపుడుకూడా ఎదురుగా ఏది కనిపిస్తే అది మింగేయాలి అన్నంత ఆకలి ఉన్నది! మరి, ఇపుడు నిజంగా ఏ మంత్రం వేసావో, ఏమోగానీ ఆకలి సంగతే మర్చిపోయాను.'' భార్యను ఒడిలోకి లాక్కుని ఆమె నుదుట ముద్దు పెట్టుకునేవాడు.

"కబుర్లతో మనుష్యులను బోల్తాకొట్టిం చేస్తారు. బట్టలు మార్చుకుని త్వరగా రండి, వడ్డించేస్తాను.'' లేచి వంటగదిలోకి వెళ్ళేది.

అతడు మళ్ళీ బయటకు వెళ్ళేవరకూ ఆమెకింకేమీ గుర్తుండేవి కావు! అసలు సాధింపులూ, అలకలూ — అలాటివి తార డిక్షనరీలోనే లేవు! ఆమెకు అలాటివి తెలియవు! ఎవరిదగ్గరయినా చూసినా చిరాకుపడేది! అలాటి తార వెంకట్‌ను ఏమని అడుగుతుంది! ఎలా అడుగుతుంది?

మళ్ళీ అతడు బయటకు వెళ్ళగానే 'ఉహూఁ— ఆయన్ని నేనేమీ అడగలేను. అయినా నా వెర్రిగానీ 'మనకు పిల్లలు పుడుతున్నారు' అని నేను చెప్పి









**ఎస్. ఎన్. ఆర్. - రాజాం**

నేటి సినీ ప్రపంచమే — నేడు మారుతున్న సమాజం అంటే ఏమంటారు ?

★ నిజమే కావచ్చు. పత్రికల్లో వార్తలు, వింటున్న సంఘటనలు చూస్తూవుంటే... కళ సమాజాన్ని అనుకరిస్తూందా ? సమాజం కళను అనుకరిస్తోందో తెలియడంలేదు.

**ఎస్. కె. ఎన్. - అనంతపురం**

ఎవరైనా తిట్టారనుకోండి. తిరిగి తిట్టడానికి, కిమ్మనక వూరుకోవడానికి తేడా ఏమిటి ? మీరు రాస్తున్న మరో నవల పేరు ఏమిటి ?

★ తిరిగి తిడితే వాళ్లకీ మనకీ తేడాపోతుంది. విరుచుకుపడేవాళ్లమీద విరుచుకు పడకుండా వుండడమే — మందు. నేను 'కొత్తపొద్దు' నవల ముగించాను. "ధర్మసూత్రం" యింకా కృత్యాద్యవస్థలో వుంది.

**ఏ. ఎస్. - శంఖవరం**

జీవితాన్ని చూడు రంగు రంగుల అద్దంలో... అన్నాడొక కవి.

★ ఏ గులకరాయి ఏ చేయి విసిరినా — అంతే సంగతులు ! జీవితాన్ని రంగుటద్దాలలోంచీ, కలల లోంచీ చూడడం - పిరికివారి పని.

**వై. హెచ్. ఎస్. ఆర్. - దోర్నకల్**

ఈ జీవిత సమరంలో మనిషికి విశ్రాంతి ఎప్పుడంటారు ?

★ చచ్చాక కూడా వుంటుందా అని నా అనుమానం.

**శేఖర్ అనంతపురం**

అర్థంలేని ప్రశ్నగా, ప్రశ్నార్థకంగా మిగిలిపోయే జీవితంపై అభిమానం, ఆశలు ఎందుచేత ?

★ ఆశ చాలా గట్టిది. ఏ క్షణంలోనైనా జీవితమనే యీ అర్థంలేని ప్రశ్నకి జవాబు దొరికేస్తుందేమో అని లాగుతుంది.

తెలిసినది కొంచెం అయినప్పుడు బహు ఖచ్చితంగా మాట్లాడతాం — కాని జ్ఞానం పెరిగిన కొద్దీ సందేహం అధికం అవుతుంది సహజమేనా ?

★ అంతా తెలుసుననుకోడం అవివేకానికీ, ఇంకా అంతా తెలియదనుకోవడం వివేకానికీ చిహ్నమంటారు. అందుకే తెలిసీ తెలియనట్టుండడం — నేర్పరితనం.

**వినోద్ - ఆదోని**

ఆడదాని ముద్దు వేడిగా వుంటుందిట. మరి మగవాని ముద్దు ?

★ ఇలాంటివి ఏ సెక్సు పత్రికలనేనా అడగండి. తమలాంటివారి ధర్మసందేహాలు చాలా సంతోషంగా తీరుస్తారు.

**సృజన - కొప్పారం**

ఇంతకీ మీ క్వాలిఫికేషన్ ఏమిటి ?

★ ఏమిటి అంతా నా క్వాలిఫికేషన్లపై పడ్డారు ? ! అసలేం అర్హతలు లేకపోవడమే కదా — పెద్ద అర్హత. వరసగా అఆలు రావు; గుణింతాలసలే రావు. విభక్తులు తెలియవు. ఇక చుక్క, కామా ఆశ్చర్యార్థకాల సంగతి సరేసరి... ఇంత తెలివిలేకపోబట్టే హాయిగా రాయగల్గుతున్నాను !!

**టి. హెచ్. - దగదర్తి**

వయస్సు చాలదని స్కూల్లో రెండేళ్లు ఎక్కువ వేశారు. ఇప్పుడు ఇప్పుడా వయస్సే క్లిష్ట సమస్య అయికూర్చుంది. పెళ్లి విషయంలో తగరారుగా వుంది.

★ అదే వచ్చిన గొడవ. స్కూల్లో — 'ఏజ్ ఎగ్జమ్షన్' కోసం అడక్క, పుట్టిన తేదీ మార్చేస్తారెందుకు ? చిన్నచిన్న విషయాల కెందుకీ మోసం ? నాకు అర్థంకాదు. (మా నాన్న బ్రతికివుంటే చెప్పేవారొక దారి ! 'నీ జాతకం ఏ జాతకానికి సరిపోవాలో చెప్పు. ఓ ఐదు రూపాయలిచ్చి ట్రిప్లికేన్‌లో రాయించి తెస్తాను' అని.)

**జి. ఎస్. ఆర్. - బొంబాయి**

కె. రా గారూ ! ఇప్పుడైతే మీ ఆడవాళ్లకు ఉద్యోగాలు యివ్వడం తప్పంటాను ?

★ నయం. మా అదృష్టం బాగుంది — ఇచ్చేవాళ్లు మిమ్మల్ని అడగడంలేదు ! అయినా ఇలాంటి బుద్ధులు పెట్టుకుని బొంబాయిలో ఎలా వుండకల్గుతున్నారబ్బా. ఏ చీపురుపల్లిలోనో చింతలపూడిలోనో — కూర్చోక !!

---

గుర్తు చేయకపోతే ఆయనకు గుర్తుండదా ? వాళ్ళ బాధ్యత ఆయనకన్నా తనకు ఎక్కువ ఉందా ! ఈ విషయాలు ఆయనకంటే నాకెక్కువ తెలుసా !' అని సరిపెట్టుకునేది.

* * *

వెంకటరత్నం గుడివాడలో పనులు పూర్తి చేసుకునేసరికి సాయంకాలమయింది. తిరిగ్గా అటూ ఇటూ చూస్తూ స్టేషను వైపుకు నడుస్తున్నాడు. పండ్ల దుకాణంలో దానిమ్మపండ్లు చూడగానే తార గుర్తుకొచ్చింది. గబుక్కున కొట్టుదగ్గిరకు వచ్చి రెండు దానిమ్మపండ్లూ, పావుశేరు ద్రాక్షా తీసుకున్నాడు. జేబులోంచి పర్సు తీస్తుండగా ఎవరో తన ప్రక్కనే నించుని తననే గమనిస్తున్నట్లు అనుమానం వచ్చింది. చటుక్కున తలతిప్పి చూశాడు. ఎదురుగా — మామ రాఘవయ్యగారు !

రాఘవయ్యగారంతటి గంభీర వ్యక్తికి కూడా వెంకటరత్నాన్ని చూడగానే ఎలాగో అన్పించింది ! చాలా కాలానికి, సడెన్‌గా చూసేసరికి ఆనందమూ, అర్థంకాని విషాదమూ సమపాళ్ళలో గొంతులో స్థావరం చేసుకుని మాటల్ని బయటకు రానీయలేదు.

వెంకటరత్నమూ ఆశ్చర్యపోయాడు. ఆ రోజు... మిట్టమధ్యాహ్నంవేళ... దాదాపు ఇంట్లోంచి తరిమేసినట్లుగా పంపేసిన తర్వాత మళ్ళీ ఆయన్నెపుడూ చూసిన గుర్తులేదు ! వాళ్ళను గురించి అసలు దాదాపుగా మర్చేపోయాడు. అందువల్లనే ఇపుడు ఆయన్ని చూడగానే అంతగా ఆశ్చర్యపోయాడు. మొదట వెంకటరత్నమే పలుకరించాడు.

"కులాసాయే కదా ?"

ఇలాటి ప్రశ్నను సాధారణంగా వెంకటరత్నం అడగడు. అసలు ఇలాటి ప్రశ్నలు అడగాల్సిన అవసరం అతనికి రాదు. అతడి మనుష్యులతో అతడు మాట్లాడే పద్ధతే వేరు ! ఇంక ఇతరులతో మాట్లాడేటపుడుకూడా ఈ ప్రశ్నతో అతనికి అవసరం ఉండేదికాదు. పైగా ఎవరయినా అలా అడగటం వింటే మనసులోనే అనుకునేవాడు — 'వెధవ చచ్చు ప్రశ్న ! కులాసాగా లేకపోతే బయటికెట్లా వస్తారు ! ఎట్లా తిరుగుతారు ! కళ్ళకి కన్పిస్తూనే ఉన్న సంగతిని మళ్ళీ అడగటం ఎందుకో' అని విసుక్కునేవాడు. అలాటి వెంకటరత్నం ఇపుడు అడిగిన ప్రశ్న — కేవలం ఆ 'చచ్చుప్రశ్నే'! అది గుర్తుకొచ్చి కొంచెం నెర్వస్‌గా, ఇబ్బందిగా కదిలాడు వెంకటరత్నం !

అసలే అభిమానం జాస్తి అయిన ఈ అల్లుడు మాట్లాడతాడో, లేదో అనుకుంటూన్న రాఘవయ్యగారు అల్లుడే మర్యాదగా పలుకరించటంతో చాలా ఆనందపడిపోయారు ! చాలాకాలానికి ఎంతో అప్పుడు కనిపించినట్లుగానే అతనితో మనసు విప్పి ఎన్నో విషయాలు మాట్లాడారు. వెంకట్ కూడా అందరి కబుర్లూ అడిగాడు.

కాపురాన్ని గుడివాడకు మార్చిన విషయం చెబుతూ "ఇంటికి వెళ్దాం రా." అన్నారు.

"మరోసారి వస్తాను" అని మృదువుగా తిరస్కరించాడు. అతని చేతిలోని దానిమ్మలూ, ద్రాక్షలూ మామగారి సంచీలో వేసి "పిల్లలకు తీసుకెళ్ళండి" అన్నాడు.

అసలు ఇలాటి మర్యాదలు వెంకట్‌కు తెలియవు మరి, ఆ సమయంలో ఆ సందర్భంలో ఎలా తెలిసిందో, ఎలా ఆ పని చేశాడో అతడికే తెలియకుండా జరిగిపోయింది.

మరలా పండ్లు కట్టించుతూ తాను 'గర్భం' సంగతి చెప్పాడు. ఆ విషయాన్ని మామగారితో చెబుతూంటే కించిత్ సిగ్గులాటి భావన కలిగింది వెంకట్‌కు.

రాఘవయ్యగారు ఆనందంతో మూగవోయారు. అది నడిబజారు అవటంతో ఆగిపోయారు కానీ, ఇల్లే అయితే అమాంతం అల్లుడ్ని ఎత్తి గిరగిరా త్రిప్పేసేవారే ! అసలు రాఘవయ్యగారికి తార అంటే పంచప్రాణాలు ! అలాటి తార 'తల్లి' అవుతున్నాదంటే — ఆయన ఆనందం వర్ణనాతీతం !

పర్సులోంచి డబ్బు తీస్తూన్న అల్లుడి చేతిపై చేయివేసి అన్నారు—"ఈ పండ్లకు నేను డబ్బిస్తాను. కేవలం నా ఆనందం కోసం," ఆయనలో స్పష్టంగా కన్పిస్తూన్న సంతోషం చూస్తూ వెంకటరత్నం మరేమీ అనలేదు.

"తార తల్లిని చూస్తానికి రెండు మూడు రోజుల్లో వస్తానని చెప్పు బాబూ" అన్నారాయన.

**(ఇంకా వుంది)**

# సుందరమ్మ పెండ్లి

యర్రసుంట్ల వరలక్ష్మీదేవి



"విన్నావుటే కమలా మన సుందరమ్మగారు లేచి పోయిందట !"

"ఆ ! ఎప్పుడే ? ఎక్కడికే ?"

"మొన్ననే- గాని ఎక్కడికి వెళ్ళిందీతెలియదు."

"అయ్యో పాపం ! ఇంత వయస్సొచ్చి ఏం జార్రుకుందామని ?"

"అదే గమ్మత్తు. ఈ ప్రేముంది చూసేరు— అది ఎప్పుడు, ఎవర్ని ఎలా కదుపుతుందో తెలియదు. అదొక పిడుగు పాటు."

"తెలుగు మాష్టరు గారు ! మీ కన్నీ ప్రేమలే ... ప్రేమించడానికి ఓ వయస్సుండొద్దు."

"సుకుమారి గారు ! మీ వయస్సులో అలాగే అనుకుంటారు గాని చూసేరు, నాకు నలభై అయిదేళ్ళు పైబడ్డా ఇంకా ఆ ప్రేమ తృష్ణ చావలేదు."

"వసుంధరా ! మన తెలుగుమాష్టరికి కూడా ప్రేమించాలనుందట. కుటుంబరావుగారు ! మీరు ఆ సుందరమ్మగార్నే ప్రేమించ వల్సింది — ఈడూ జోడూ సరిపోవును."

టీచర్సు రూములో మూగిన మాష్టర్లమ్మ లందరు కిలకిలా నవ్వుకున్నారు.

"అదిగో ప్రమీల వస్తూంది. ప్రమీలకు తెలియని విషయముండదు. ఏం ప్రమీలా ! ఈ దుర్ఘటన విన్నావా ? మన హెడ్మిష్ట్రస్ రెండు రోజుల క్రితం లేచిపోయిందట. ఎవరితో లేచి పోయిందో, ఎక్కడికి లేచి పోయిందో తెలియక నిద్రా హారాలు మాని గాభరాపడుతున్నామే."

"అలాగా ! మన ఈశ్వరప్పంతులన్నట్లు — శుభం ! ఇంతకీ ఎక్కడకి వెళ్ళుంటుంది చెప్మా !"

"అయ్యో ! ఎవడితో లేచి పోయుంటుంది ఉప్మా !" అని సుజాత కిసుక్కుమంది.

"ఉండవే, మన సి.బి.ఐ. ఏజంటు ప్రమీలను ఆలోచించనీయి."

"మొట్టమొదట ఆలోచించ వలసిన విషయము లేచి పోయిన వ్యక్తి పరిసరాల్లో ఉన్న పురుషులెవ్వరు? మొదట ఉద్యోగములో తారసిల్లిన మొగవారు, తరువాత ఇంటి చుట్టు పట్ల ఉన్న వ్యక్తులు, సాధారణముగా ప్రేమను పొందేవారు వీరే. నియర్‌నెస్ ఉంటే గాని డియర్‌నెస్ కలుగదు. మనస్కూల్లో ఉన్న పురుషులు నలుగురు. సరోజ ! వాళ్ళ అర్హతలు చెప్పా ?"

"తొలివ్యక్తి తెలుగు మాష్టరు కుటుంబరావు గారు. వయస్సు నలభై అయిదు. ఒక భార్య, ఐదుగురు పిల్లలు. బహుభార్యత్వం నిషేధం కనుక ఆయనకు ప్రేమ తృష్ణ పోకపోయినా ఫలితం శూన్యం."

"ఇంతకీ మాష్టారు మన మధ్యనున్నారు కనుక ఆయన పేరు కొట్టెయ్యొచ్చు"

"రెండో వ్యక్తి మన స్కూలు గుమస్తా నరసింహం. వయస్సు నలభై. బాగానే ఉంటాడు గాని చాలా నీరసం మనిషి. పెళ్ళైందో లేదో తెలియదు. మూడు రోజులై శలవులోనే ఉన్నాడు."

'అతడ్ని అనుమానించవల్సిందే. వివరాలు తరువాత సేకరిద్దాం."

"మూడవవ్యక్తి ఎటెండరు రామారావు. సుమారు ముప్పైఎనిమిది సంవత్సరాలు. పెండ్లి కాలేదు. పొడవుగ, ధృడంగానే ఉంటాడు. ఎలిజిబుల్ కాండిడేట్. అతడు మూడురోజులై స్కూలుకు రావడంలేదు."

"కాని మేడమ్ కన్న వయస్సులో ఒకటి,రెండు సంవత్సరాలు చిన్న వాడేమోనని నా సందేహం ఇంతకీ మేడమ్ ఎమ్. ఏ. బి. ఇ. కి చదువుకుంది రామారావు స్కూలుఫైనలు మూడుసార్లు తప్పిన ఎడ్యుకేషనిస్టు."

"ప్రేమ గుడ్డిది కనుక అతడిపేరును సస్పెక్టు లిస్టులో ఉంచవల్సిందే."

"ఇకమిగిలిన మహాపురుషుడు మన ఆఫీసు ప్యూను అప్పలస్వామి. వయస్సు ఏభై సంవత్సరాలు. బహుకుటుంబీకుడు. ప్రస్తుతం డ్యూటీలోనే ఉన్నాడు. పాపం వాడిపేరు కొట్టెయ్యవే ప్రమీలా ?"

"సరే ఇక సుందరమ్మగారింటి పరిసరాల్లోని యువకులు ఎవరైనా మిస్సింగేమో కనుక్కుంటా. వాళ్ళ వీధిలో నా ఫ్రెండు కోమలి ఉంది. రేపటికి మీకా తోడుదొంగల్ని పట్టించే పూచీనాది." ప్రమీల ఆత్మస్థైర్యంతో అందరివైపు చిరునవ్వు చిందించింది.

"ఇంతకీ నా దిగులేమంటే - పాపం సుందరమ్మ మేడమ్ ఇంతవయసొచ్చి అంతపని ఎందుకు చేసిందా అని" విమలాటీచరు చాల విచారాన్ని వెలిబుచ్చింది.

టీచర్లంతా వాళ్ళ సంభాషణలో మునిగిపోయి, వింతైన ఓ విషయాన్ని విన్నామన్న సంరంభంలో హెడ్మిస్ట్రెస్ సుందరమ్మగారు ద్వారంవద్దకు వచ్చి నిలబడటం చూడలేదు.

"డియర్ టీచర్స్ ! మీకెవ్వరికీ క్లాసుల లేవా — ఇలా జీతాలు పుచ్చుకుని కాలం వృధా చేస్తున్నారు ?"

సుందరమ్మగారి కంఠం ఖంగున స్కూలు గంటలా మ్రోగేసరికి అందరు ఒక్కసారి ద్వారం వైపు చూసి గతుక్కుమని పాలిపోయిన ముఖాలని దించుకున్నారు నోట మాట రాక.

[illegible] క్లాసులకు వెళ్ళండి," అని హెచ్చరించి సుందరమ్మగారు వెళ్ళిపోయారు టీచర్లంతా కిక్కురుమనకుండ ఒకరిముఖాలొకరు చూసుకొందుకు కూడ సిగ్గుపడిపోయి, మెల్లగా తమక్లాసులకు జారుకున్నారు. సుందరమ్మమేడమ్ అంటే ఒకరకమైన జంకు, తత్ఫలితంగా చిన్న ద్వేషంకూడ.

సాయంత్రం ఆఖరి బెల్లు కొట్టడానికి పది నిముషాలుందనగా సుందరమ్మగారు ప్యూనుద్వారా టీచర్లందరికి చిన్న విజ్ఞాపన పంపేరు. క్లాసులై పోయాక తన రూమ్‌లోకి రమ్మని. ఆ కబురు అందగానే అందరి మనస్సులలో కాస్త ఆందోళన కల్గింది. ప్రొద్దున్న జరిగిన వ్యవహారానికి తీరుబాటుగా ఏం చీవాట్లు పెడ్తుందోనని. చేసేది లేక మెల్లగా క్లాసులై పోయాక మేడమ్ రూములోకి చేరేరందరు.

సుందరమ్మ చిరునవ్వుతో అందర్ని కూర్చో మంది. టేబిలుమీద ఉన్న కాగితాలను, ఫైళ్ళను ఓ రెండు నిముషాలలో చూడడం పూర్తిచేసి, ముఖ్యమైన కాగితాలను డ్రాయరులో పెట్టి తాళం వేసి నిల్చుంది. అందరు ఆతృతగా ఆమె వెపు చూచేరు. సుందరమ్మ చూపులో ఎంతో మనోబలం, ఒక రకమైన తృప్తి గోచరిస్తోంది.

"డియర్ టీచర్స్! మీరు ప్రొద్దున నాగురించి ఏమేమో అనుకున్నారు. దానికి నేనేం బాధపడలేదు, స్కూలు కాలం వృధాచేసేరన్న దిగులు తప్ప. మీ కుతూహలం సహజమైనదే. ఇంకా మిమ్మల్ని సస్పెన్సులో ఉంచి బాధ పెట్టడం ఇష్టం లేక స్వయంగా మీకో శుభవార్త తెలియజేద్దామన్న ఉద్దేశంతో మిమ్మల్నందర్ని రమ్మన్నాను." కాస్త ఆగింది. అనుకోకుండానే ఆవిడ ముఖంలో పెండ్లి కూతురుకు సహజమైన సిగ్గు, కళ ద్యోతకమైంది.

"నేను మన ఆఫీసులో ఎటెండరుగా పని చేస్తున్న రామారావుగార్ని మొన్ననే తిరుపతిలో దైవసన్నిధిలో వివాహం చేసుకున్నాను."

ఈ వార్త వినగానే అందరి ముఖాలు షాక్ తిన్నట్లయిపోయేయి. మూడవ ప్రపంచ యుద్ధం ప్రకటించినట్లుగా కంపించిపోయారు. సుందరమ్మ ఈ విషయాన్ని గుర్తించి, చిరునవ్వుతో అంది--

"నాకిప్పుడు నలభై సంవత్సరాలు. ఇన్నాళ్ళు నేను మోడుగా, ఒంటరిగా ఏ సుఖసంతోషాలని అనుభవించక యాంత్రికమైన జీవితాన్ని గడిపేను. అట్లాంటి బ్రతుకు మీద విసుగు కల్గి, ఇంకా వయస్సు మీరిపోకుండా, ఇంకా మనస్సు బండబారి పోకుండా ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో తెగించి నాకు తోడును, జీవిత భాగస్వామిని చేకూర్చు కున్నాను. ఇల్లాలు నయ్యేను. ఇది నేరంగా తీసు కోకుండా సహోధ్యాయులైన మీరు, ఇందుకు సంతోషించాలని నా కోరిక" సుందరమ్మ అందరి ముఖాలను ఆందోళనతో పరిశీలించింది.

అందరు టీచర్లు మొదట చకితులైన మాట నిజమే! కాని సమయంలోమేడమ్ చెప్పిన మాటల్లోని కించిత్తు సహజత్వాన్ని, ఆపేక్షను గ్రహించి, ఆమె పట్ల సద్భావన కల్గి, అందరు ఒకరి తరువాత ఒకరు లేచి మేడమ్ దగ్గరగ వచ్చి కరచాలం చేసి మనస్ఫూర్తిగా అభినందనల్ని తెలియజేసేరు.

"ఈ శుభ సమయాన్ని పురస్కరించుకుని ఎల్లుండి ఆదివారం మధ్యాహ్నం ఓ చిన్న విందు ఏర్పాటు చేసేను, మా ఇంట్లో. మీరు అందరు దయ చేసి మాఇంటికి రావాలి– వస్తారు కదూ ?"

"తప్పకుండా."

సుందరమ్మ రిక్షా ఎక్కికూర్చున్న దగ్గర్నుంచి ప్రొద్దున్న టీచర్లు అనుకొన్నమాటలే జ్ఞాపకానికి రాసాగేయి. "ఇంత వయసొచ్చి అంతపని యెందుకు చేసిందా"అని తను ముసల్దికాదే. పెండ్లి చేసుకోరాని వయస్సుకాదే. అంతపని అంటే ఎంత పని చేసింది తను? చేయరానిపని చేయలేదే. వివాహమాడడం అగౌరవమైన పనికాదే. రామారావు ఎటెండరు. అందుకేనా వీళ్ళ ఈసడింపు. ఎమ్.ఏ. చదువుకున్న పురుషుడు స్కూలుఫైనలు చదువు కున్న లేక ఏమీ చదువురాని స్త్రీని పెండ్లాడ్డంలో లేని తప్పు, ఎమ్. ఏ. చదువుకున్న తను, స్కూలు ఫైనలు చదువుకున్న రామారావును వివాహమాడ డంలో తప్పేముంది. తనకన్న వయస్సులో చిన్నవా డనుకుంటున్నారేమో. అది సరికాదే. ఎందుకంటే సర్వీసు బుక్ తన ఆఫీసులోనే ఉంది. రామారావు తనకన్న ఎనిమిదినెలలు పెద్దవాడు. ఇంతకీ రామారావును మభ్యపెట్టి మోసంచేసి పెండ్లి చేసుకోలేదు. కొన్నాళ్ళ రామారావును బాగా ఆలోచించుకోనిచ్చి ఒకర్నొకరు బాగా అర్థం చేసుకున్న తరువాతే ఈ వివాహానికి ఒప్పుకున్నారు. ఇంతకీ రామారావు మంచివ్యక్తి. తన అన్నయ్య వారికి దూరపుబంధువు కూడ. గౌరవమైన కుటుంబంలోనుంచి వచ్చినవాడే. వారి తండ్రి ఒకప్పుడు ఘనంగా బ్రతికి కొన్ని కారణాలవల్ల, కోర్టు తగాదాలవల్ల ఆస్థంతా పోగొట్టుకుని చితికి పోయిన సంసారి.

పరిస్థితులు తెలియక తన సహోధ్యాయులు ఈ విధంగా అనుకోవడంలో అసహజమేమిలేదు తను దానిగురించి మరీ మరీ అనుకోవడంలో అర్థంలేదు.

గాంధి నగరంలో తనిల్లు చేరినా రిక్షావాడు హెచ్చరించుతేగాని ఆలోచనల్లోంచి బయటపడలేదు సుందరమ్మ.

చేతిలోని హేండ్‌బాగ్‌ని గదిలోని బీరువాపైన పడేసి, స్టాండుమీదున్న తువ్వాలు తీసుకొని పెరట్లోకి వెళ్లి, ముఖం, కాళ్ళు, చేతులు కడుక్కొని హాలులోనికి వచ్చింది సుందరమ్మ ప్లాస్కుకోసం టేబిలుపై చూస్తుండగి, నవ్వుతూ తల్లి పార్వతమ్మ వేడికాఫీతోవచ్చి కూతురుకు అప్యాయంగా కప్పు అందించింది. హాలులో కుర్చీలో కూర్చుని కాఫీత్రాగుతూ కాస్త విస్మయంగా తల్లి వైపు చూసింది.

"ఏమమ్మా చాల అలసినట్లున్నావు ? ఈ శుభవార్త నీ స్నేహితులందరికి చెప్పేవా ?"

"ఆ." ఇంతలో తండ్రి నరసింహం ఓ సంచీతో హాలులోకి వచ్చేడు.

"ఏమమ్మా సుందరి – అలా బజారు వైపు వెళ్తున్నాను. ఏమైన సరుకులు తీసుకునిరావాలంటే చెప్పు, తీసుకొస్తా."

సుందరమ్మ నిస్తుపోయింది. ఏమిటి వీళ్ళలో ఈ మార్పు !

"రెండు మార్గోసబ్బులు – ఒకకేజీ బంగాళ దుంపలు తెస్తే చాలు నాన్నా."

స్కూలు పిల్లలు అప్పుడే వచ్చేరు గోపి, మురళి, సత్య పుస్తకాలు హాలులోన పడేసి "అత్తయ్యా! ఇవాళ మా స్కూల్లో మం. మాజిక్కు చూపెట్టేరు," అని గోలగా చుట్టు ముట్టేరు. అంతలోనే మేడ మీదున్న గదిలోంచి రివ్వున సుందరమ్మ మరదలు రమణి వచ్చింది.

"ఏమిట్రా ఆగోల-- అత్తయ్య కూడ ఇప్పుడే వచ్చింది. కాస్త సేద దీర్చుకోనివ్వండి. ముందుగా పెరట్లోకి వెళ్ళి కాళ్ళు చేతులు, ముఖం కడుక్కొని రండి, టిఫినిస్తాను." పిల్లలు పెరట్లోకి పరు గెత్తేరు. రమణి మేడపైకి పోయింది. తండ్రి బజారుకు నిష్క్రమించేడు.

"రాత్రికి వంట ఏం చెయ్యమంటావు?" తల్లి వేసిన ప్రశ్నకు చాల ద్రిగ్భ్రాంతి చెందింది సుందరమ్మ.

"తొందరేమిటమ్మా-- ఓ గంట పోయాక నేనే వండుతాగా."

"అసలే అలసటగా వచ్చేవు--మళ్ళీ ఈ వంట గొడవెందుకు. నేచేస్తాలే. నాకిప్పుడేం పని చెప్పు. వంకాయ వేపుడు చేయమన్నావా ? అబ్బాయి రామారావు భోజనానికి వస్తాడా ?"

"అతను వాళ్ళింట్లో భోజనం చేసి కాస్త ఆలస్యంగా వస్తానన్నారు. ఏదో పనుందట."

పార్వతమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది. సుందరమ్మ ఆశ్చర్యపోతూ అలా హాలులో కూర్చుండి పోయింది.

తనింట్లోని మనుష్యులందరు ఇలా మారి పోయారేమి ? తనంటే ఇంత ఆప్యాయత చూపి స్తున్నారేమిటి?

సుందరమ్మ ఆశ్చర్యపోవడంలో సబబు లేక పోలేదు. సుందరి విశాఖపట్నంలో ఎమ్. ఏ. చదువు తున్నప్పుడు అన్న శేఖరానికి వివాహమైంది. అప్పటికే అతడు కలకత్తాలో ఉద్యోగం చేస్తుండేవాడు. భార్య కాపురానికొచ్చిన తరువాత తండ్రికి డబ్బు పంపడం మానేసేడు, అతడిజీతం సంసారానికి చాలడం లేదని. సుందరి తండ్రి నరసింహం స్థానికంగా ఉన్న హైస్కూల్లో లెక్కల మాష్టారుగా పనిచేసేవారు. స్కూలు జీతంతో పాటు ఇంటివద్ద కొన్ని ప్రయి వేట్లు చెప్పి సంసారాన్ని బాగానే నెట్టుకొస్తుండే వారు. పైగా పెద్దలు మిగిల్చి పోయిన ఒక డాబా యిల్లు కాకినాడ గాంధీ నగరంలో ఉండనే ఉంది నివాసానికి. ఇక మిగిలిన పిల్లలు రెండో కూతురు జానకి. రెండో కొడుకు వెంకటేశం. చిన్న పిల్లలిద్దరు తను పని చేసే స్కూలులోనే చదువుకుంటున్నారు.

సుందరి ఎమ్. ఏ పూర్తిచేసి, బి. ఇడి ట్రెయినింగు రాజమండ్రిలో అవుతున్నప్పుడు తండ్రి రిటైరైపోయేరు. టీచరు ట్రెయినింగు పూర్తిచేసి కాకినాడ వచ్చేసి, ఆ ఊరులోనే ఒక హైస్కూల్లో టీచరుగా చేరింది. అప్పటికి సుందరికి ఇరవైమూడు వసంతాలుగడిచేయి. సుందరి టీచరుగా చేరినతరువాత 2 సంవత్సరాల వరకు నరసింహం ప్రయివేట్లు చెప్పి రెండు వందలు తెస్తుండేవాడు. ఓసారి పారాటైఫాయిడ్ జ్వరం వచ్చి రెండు నెలలు మంచం ఎక్కేడు. తరువాత ఆరోగ్యం దెబ్బతిందని

# సుందరమ్మ పెండ్లి

ప్రయివేట్లు చెప్పడం పూర్తిగా మానుకున్నాడు. తన పెన్షను డబ్బులోను, సుందరి జీతం రాళ్ళలోను ఎలాగో జీవితం గడిచిపోతూంది.

సుందరి టీచరు జీవితం ప్రారంభించిన రెండు సంవత్సరాల కాలంలోను తండ్రి, తల్లి కూతురుకు పెండ్లి చేద్దామని పట్టుదలతో ఎన్నెన్నో సంబంధాల గురించి ప్రయత్నించేరు. ఇద్దరు పెండ్లి కొడుకులు పిల్లను చూడడానికి కూడవచ్చేరు. అందులో ఒకరు మంచి ఉద్యోగంలోనే ఉన్నాడు, కాని సుందరి కన్న కాస్త పొట్టి. చూడగానే వరహీనమని చెప్పి పెండ్లి వారు వెళ్ళిపోయేరు. ఆ రాత్రి తనంత పొడవుగా ఉన్నందుకు సుందరి ఖేదపడింది. రెండో పెండ్లి కొడుకు నల్లటి నలుపుగాని అతడికి తెల్లని పిల్ల కావాలిట. చామనఛాయలో సంసార పక్షమైన ఒందంతో వున్న సుందరి అతగాడికి నచ్చలేదు. ఇలా ఆ రెండు సంబంధాలు పోయేయి.

సుందరికి పాతిక సంవత్సరాలు వయస్సు ఎవరికి చెప్పకుండానే దాటేసింది. తండ్రి విశ్రాంతి కోసం క్లబ్బుకు వెళ్ళడం మొదలెట్టేడు. తల్లి మాత్రం ఇంటికి ఎవరైన బంధువులు గాని, స్నేహితులుగాని వస్తే సుందరికి ఆ సంవత్సరమేఎలాగైనా వివాహము చెద్దామను కుంటున్నాము గనుక ఏదైన మంచి సంబంధము చూడమని గోల పెట్టేది. రెండు మూడు సంబంధాలు వచ్చేయిగాని సుందరి తండ్రికి గాని,తల్లికిగానినచ్చలేదు. ఒకతను సుందరిలా టీచరు గాని సుందరిలా ఎమ్. ఎ చదవలేదు. అందుకే తండ్రికి నచ్చలేదు. మరొకడు బాంకు గుమాస్తా ఎమ్.ఎ చదువు కున్నాడు. కాని కుర్రాడి తల్లి వయస్సులో ఉన్నప్పుడు ఏదో తప్పు పని చేసిందని ఒక పుకారుంది. వంశము మంచిది కాదని సుందరి తల్లి ఆ సంబంధానికి ఒప్పుకోలేదు.

ఇలా మరో మూడేళ్ళు గడిచే సరికి తల్లికి, తండ్రికి సుందరికి పెండ్లి చెయ్యాలనే ధ్యాసే పోయింది. ఎవరైన పనిగట్టుకొని ఇంటికి వచ్చి పార్వతమ్మ నడుగుతే "చేస్తామమ్మా — పిల్లకి పెండ్లి చెయ్యకుండ ఇంట్లో పెట్టుకుంటామా ఏమిటి? సరైన సంబంధము రావద్దూ, రాత్రనక పగలనక ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాము. పదివేలు, పన్నెండు వేలూ కట్నాలు ఇవ్వలేంగాని సంసార పక్షంగా ఆరువేలు ఇద్దామనుకుంటున్నాము. మీకే మైన మంచి సంబంధాలు తెలుస్తే చెప్పండి" అని సర్దుకోపోయేది. ఆ మరుక్షణం సుందరి పెండ్లి సంగతే మరచిపోయేది. ఆడ పిల్ల సుందరి ఏమని తల్లిదండ్రులకు చెప్తుంది?

కొన్నాళ్ళకి తల్లి, తండ్రి పూర్తిగా కూతురి అర్జనపైన ఆధారపడిపోయేరు. కూతురి జీతం లోనే రెండో కొడుకు బి.ఎ; రెండో కూతురు ఇంటరు పూర్తి చేసేరు. వెంకటేశం రెండు సంవత్సరాలు పేపరులో కనిపించిన ప్రతి ఉద్యోగానికి అక్కనడిగి డబ్బువుచ్చుకుని దరఖాస్తుల్ని పుంఖాలు, పుంఖాలుగా పంపేడు. ఆఖరికి ఎలాగో ఉన్న ఊర్లోనే ఓ గవర్నమెంటు ఆఫీసులో క్లర్కు కమ్ టైపిస్టు ఉద్యోగం వచ్చింది. ఉద్యోగంలో చేరిన మరునాటి నుండి పెండ్లి కూతుర్ల తండ్రులు, తల్లులూ నరసింహం ఇంటికి రహదారి పోసేసేరు. పార్వతమ్మ, నరసింహం గుమస్తా, గుమస్తా ఓ ఎనిమిది వేలు కట్నం పుచ్చుకొని కొడుక్కి వివాహం చేసేరు. అలాగని పెద్దకూతురు సుందరి వివాహం గురించి మరచిపోలేదు. అప్పటికి కొడుకు పెండ్లికి వచ్చిన వారందర్నీ అడుగుతూనే ఉన్నారు. ఏమైనా తగిన సంబంధము తెలిస్తే చెప్పమని. కాని వచ్చిన చిక్కేమిటంటే అప్పటికే సుందరికి ముప్పై ఏళ్ళు దాటిపోయేయి. వరుడికి కనీసం ముప్ఫైనాలుగేండ్లైనా ఉండాలి కదా. అదేమి వింతోగాని ఎక్కడ చూచిన పెండ్లికొడుకులంతా ముప్ఫైయేళ్ళలోపు వాళ్ళేగాని అంతకు పైబడ్డ వయస్సు వాళ్ళు దొరకలేదు.

మెల్లగా సుందరి సుందరమ్మయి పోయింది.

సుందరమ్మకు ముప్ఫైమూడేండ్లు వచ్చేసరికి చెల్లెలు జానకికి ఇరవై రెండేళ్ళు వచ్చేయి. విశాఖ పట్నంలో భారత హెవీప్లేట్సు కంపెనీలో పని చేస్తున్న ఓ డ్రాఫ్ట్స్ మేన్‌కిచ్చి ఓ ఏడువేలు కట్నముతో జానకి వివాహము జరిపించేరు. పెండ్లి కొడుకుని చూసి రావడము—మంచి చెడ్డలు విచారించడం, వైభవంగా గాంధీనగరములో పెండ్లి అంతా పెద్దక్క సుందరమ్మ చేతులపైనే జరిగింది.

రెండేళ్ళ క్రితం సుందరమ్మ జి. పి. ఎఫ్ లోంచి డబ్బు తీసి ఇల్లు ఇరకాటంగా ఉందని డాబాపైన ఓ గది కట్టించింది. అందులోకిమారింది. తన పుస్తకాలతో, క్లాసు పిల్లల అన్సరు పేపర్లతో, తన ఆలోచనలతో, నిట్టూర్పులతో సుందరమ్మ ఆ గదిని నింపింది.

సుందరమ్మ మరదలు కాపురానికి వచ్చిన తరువాత తల్లే ఓనాడు సుందరమ్మకు చెప్పింది — "చూడు సుందరి! వాళ్ళు చిన్నవాళ్ళు కదా క్రింది గదిలో ఉండటానికి వాళ్ళకు బొత్తిగా సిగ్గేస్తోంది. పైగా నేను మీ నాన్న తిరుగుతుంటామాయే. అందుకు నువ్వు మరోలాగనుకోకపోతే, ఆ డాబా గదివాళ్ళకిచ్చేసి నువ్వు మునుపున్న క్రింది గదిలోకి వచ్చేస్తే బాగుంటుంది. నిన్నేం బలవంతము చేస్తున్నాననుకునేవు," ఆఖరికి సుందరమ్మకు తన కోసము ప్రత్యేకంగా ఏమి మిగల లేదు.

పెద్దకొడుకు డబ్బు పంపక పోయినా, సంవత్సరానికి ఒక ఉత్తరం వ్రాసినా తండ్రి ఏమీ అనుకోడు. పైగా శేఖరంటే తండ్రికి సానుభూతి కూడ — "కలకత్తాలో కాపురమంటే మజాకా — రోజుకు అయిదు రూపాయలు చిల్లర ఖర్చే అవుతుంది." రెండో కొడుకు వెంకటేశమంటే తల్లికి ముద్దు. వాడికి, వాడి పెండ్లానికి బట్టలకి, సినిమాలకి తెగ డబ్బు తగలేసి ఏదో ఇరవయ్యో, పాతికో తండ్రి చేతిలో పెడ్తాడు. తండ్రి ఆ డబ్బును కొంత క్లబ్బులో పేకాటలోను, కొంత సినిమాలకి ఖర్చు పెట్టేస్తాడు. ఇక కూతురు జానకి పుట్టింటికి వస్తే సరే సరి. "అమ్మా జానకి! అక్కతో అలా బజారుకు వెళ్ళమ్మా, మంచి చీరలొచ్చాయట చెల్లారావ్ పేటలో. చక్కని క్రొత్త చీర కట్టుకుని వెళ్తే మీ అత్తగారు సంతోషిస్తుంది." ఇట్లాంటి ఖర్చులు. ఇంటి ఖర్చంతా సుందరమ్మే భరించాలి.

అంతేగాని సుందరమ్మను ఓ మనిషిగా ఇంట్లో ఎవ్వరు గుర్తించడము మానుకున్నారు. డబ్బును గడించే ఓ యంత్రమని, ఇంటికి చాకిరీ చేసే ఓ బానిసగా పరిగణించడం మొదలు పెట్టేరు. సుందరమ్మ, స్త్రీ అని ఆమెకు వివాహముచేయాలన్న ఆసక్తే ఎవరికి లేకుండా పోయింది. ఓ నిట్టూర్పు విడవడం తప్ప సుందరమ్మ చేసేదేమి లేకపోయింది.

ఇలా కొన్నాళ్ళు గడిచేక అంటే గత మూడేళ్ళ క్రితం ఓ విశేషము జరిగింది. ఏమీతోచక ఓనాడు సినిమా చూద్దామని స్వప్న టాకీసుకు వెళ్ళింది






సుందరమ్మ. ఆమె వెళ్ళే సర్కిల్ పై తరగతులలోని టిక్కెట్లన్నీ చెల్లిపోయాయి. ఇంటికి తిరిగి వచ్చేద్దా మనుకుంటుండగా ఒకతను వచ్చి "మీకు అభ్యం తరము లేకపోతే నా దగ్గర స్పేరు టిక్కెట్టుంది కావాలా?" అనడిగాడు. సరేనని డబ్బిచ్చేసి, ఆ టిక్కెట్టు తీసుకుని లోనికి పోయింది. తన టిక్కెట్టు పైనున్న నంబరు ప్రకారము వెళ్ళి కూర్చుంది. కాస్సేపయ్యాక తన ప్రక్కనే టిక్కెటిచ్చిన ఆసామి వచ్చి కూర్చున్నాడు. కొంతసేపయ్యాక అతడు సంస్కారవంతుడే అని గ్రహించింది. ఎందుకంటే అతడు చాల జాగ్రత్తగా కూర్చున్నాడు. అనవసరంగా ఆమెను మాట్లాడించడంగాని, పొరపాటున చేతులు, కాళ్ళు తగిలించడంగాని చెయ్యలేదు. ఇంటర్వెల్‌లో "కాఫీ త్రాగుదాం రండి," అని మర్యాదగ పిలచేడు. కాఫీ త్రాగుతున్నప్పుడు తన పేరు స్వాధీనరావని, ఆ ఊర్లోనే కాలేజీలో లెక్చరర్ అని చెప్పేడు. సుందరమ్మ పేరు, చదువు, ఉద్యోగము అడిగి తెల్సు కున్నాడు. ఈ ఇంట్రొడక్షన్, ఈ ప్రశ్నించడం చాల సహజముగానే జరిగింది. సుందరమ్మ హృదయాంత రాళంలో ఓ చిన్న ఆశాజ్యోతి వెలిగింది.

తరువాత రెండు మూడు సార్లు ఆ నెలలో ఎదురయ్యేడు. ఒకనాటు ధైర్యం చేసి 'సినిమాకు రమ్మన్నాడు. సరేనంది. మరొకనాడు ఆదివారం ఇద్దరు కలసి యానాం వెళ్ళి గోదావరి తీరాన్న కూర్చున్నారు. అక్కడ స్వాధీనరావు తన మనస్సు లోని మాటను బయట పెట్టేడు. "సుందరిగారు! మీరంటే నాకు చాల ఇష్టం. మీకు నేనంటే

# సుందరమ్మ పెండ్లి

ఇష్టమైతే చెప్పండి. నేను నా తల్లిదండ్రులతో మాట్లాడి వివాహానికి ఏర్పాటుచేయిస్తాను." "నాకు ఇష్టమే. అని ఆశతో స్వాధీనరావు ముఖంలోకి చూసింది. ఏర్పాటు ప్రకారం వాళ్ళు రోజుల తరువాత గాంధినగరము పార్కులో కలిసేరు. సుందరమ్మ గాలిలో తేలిపోతూ వెళ్ళింది. స్వాధీనరావు చాల విచారంగా ముఖము పెట్టేడు. ఏమయిందని అడిగింది. తన తల్లి దండ్రులకు ఈ పెండ్లి ఇష్టమేగాని పదివేలు కట్నానికి ఏ మాత్రము తగ్గినా వాళ్ళు ఒప్పుకోవడం లేదని చెప్పేసేడు. ఒక్కసారి గాలి తీసివేసిన బుంగలాగయి పోయింది సుందరమ్మ.

"మాకేమి ఆస్తిపాస్తులు లేవు జీతముతప్ప. ఉన్న ఆ ఒక్క పిత్రార్జితము ఇల్లు మానాన్న తనఖాపెట్టి నా చెల్లెలి పెండ్లి చేసేరు. ఆ ఇంటిమీద బాకీ తీరనేలేదు. ఏంచేం చెయ్యడం ?"

"ఇన్నాళ్ళ ఉద్యోగం చేస్తున్నారుకదా, ఆ జీతమంతా ఏంచేసేరు ?"

దాంతో సుందరమ్మకు అతడంటే ఓవిధమైన అసహ్యము కల్గింది. పార్కుబెంచీమీంచి లేచి కోపంతో, "నాజీతమంతా నేనేం చేసుకున్నది అడిగే హక్కు మీకెవరిచ్చారు? ఇంతకీ ప్రేమించడము మీ వంతు, కట్నం పుచ్చుకోవడం మీ తండ్రి వంతునా ? ఇంత వయసొచ్చి, ఇంత చదువుకుని కూడ వ్యక్తిత్వంలేని మనిషివి నువ్వు ఓ మగాడివేనా ?" అని చీదరించుకుని వచ్చేసింది.

ఆ మహాపురుషుడు స్వాధీనరావు అస్వాధీనుడై నోట మాటరాక దిగులుగా ఆ పార్కులో కూర్చుండి పోయేడు. ఆ నాటకము అంతటితో ముగిసింది.

ఆరు నెలల క్రితం మరో సంఘటన జరిగింది. ఆ రోజు ఆఫీసులో కూర్చుని ఏదో ఫైలు శ్రద్ధగా చూస్తోంది. అటెండరు రామారావు గదిలోకి రావడం గమనించలేదు. సుందరమ్మ పుష్టిగా, ఆరోగ్యంగా వుంటుంది. ఆనాడు కాస్త పైట జారింది. లేత నీలిరంగు రవిక ఉబ్బి గుండ్రముగా, ధృఢముగా అగుపిస్తోంది. రామారావు అనుకో కుండానే అందమైన దృశ్యాన్ని చూసి, సుందరమ్మ నునుపైన చెంపల్ని చూస్తూ సమ్మోహితుడై అలా ఉండిపోయేడు. కొద్ది క్షణాలయ్యేక సుందరమ్మ ఎందుకో తలెత్తి చూసింది రామారావు చూపుకి గతుక్కుమని క్రిందకుచూసి సిగ్గుపడిపోయి పైట సర్దుకుని కూర్చుంది రామారావును తీక్షణంగాచూసి "ఎంతసేపయింది మీరొచ్చి? ఎందుకొచ్చేరు ?" అని అడిగింది.

రామారావు సిగ్గుతో మొహం ఎర్రగ చేసుకుని తొట్రుపాటుపడి "ఇప్పుడే" అని ఏదో గొణిగి తను తెచ్చిన ఎటెండెన్సు రిజిష్టరు టేబిలుమీద పెట్టేసి వెళ్ళిపోయాడు.

సుందరమ్మ ఆరోజంత మరేపని చేయలే పోయింది. రామారావుచూపు సుందరమ్మలో స్త్రీత్వాన్ని మేల్కొల్పినట్టయింది. ఆమె అంతరంగములో ఓ తుఫానును లేవదీసింది ఇంటి

నటసామ్రాట్
డా॥ **అక్కినేని**
నటించిన

దాసరి నారాయణరావు

# రాగదీపం

దాసరి నారాయణరావు
సమర్పించు




వీరరాణీ ఎంటర్‌ప్రైజస్

సంగీతం: చక్రవర్తి ఫొటోగ్రఫీ: సెల్వరాజ్ నిర్మాత: కొడాలి బోసుబాబు

సీడెడ్: స్వర్ణయుగ మూవీస్




SAIKRISHNA ADS

## బంగారుభూమిలో గోగ్రహణం

బోస్‌బాబు (సత్యనారాయణ) ఆవును లాక్కెళ్ళ తూంటే వెంకటసుబ్బమ్మ (రామకుమారి) ప్రాధేయ పడుతూ వెంటబడింది : "బాబ్బాబూ! మీ కాళ్ళు పట్టుకుంటాను. తల్లిలేని నా కూతురుబిడ్డకు ఈ ఆవుపాలు పడుతున్నాను. ఈ ఆవు లేకపోతే, ఆ పసిపిల్ల బతకదు, బాబూ! ఇంకా కొన్నాళ్ళు గడువిప్పించండి."

బోస్‌బాబుది కసాయిగుండె. వెంకటసుబ్బమ్మను నెట్టేసి, ఆవుని లాక్కుంటూ ముందుకు సాగాడు.

ఇంట్లోంచి బయటకు వస్తూన్న కాసులయ్య (అల్లురామలింగయ్య) "ఆహా! ఓహో! కార్య సాధకుడివి అంటే నువ్వేనయ్యా. ఆనాడు భారతంలో గోగ్రహణం చేసిన దుర్యోధనుడి తమ్ముడిలా ఉన్నావు" అన్నాడు.

"అమ్మనీయమ్మ ... ఏంటయ్యో తెగ పొగుడుతున్నావ్? కమీషన్ ఎగ్గొడదామనా?" అన్నాడు బోసుబాబు వెకిలిగా నవ్వుతూ.

ఇంతలో ఆ దారంట వస్తూన్న రవి (కృష్ణ) "ఏం, కాసులయ్యా! ఆవుని అమ్ముతున్నారా, కొంటున్నారా?" అని అడిగాడు.

"నువ్వు కొంటావా — చెప్పు." అన్నాడు కాసులయ్య.

"బేరం కుదిరితే కొంటాను. ఎంత?"

"చూడు, రవిబాబూ! నీకు ఇంతగా చెప్పాల్సిందిలేదు ... నా ముఖాన వెయ్యిపారేసి తోలుకు పో."

"సరే ... వెయ్యి రూపాయలకు ఆవుని మీరే తీసుకుని, అందులో వెంకట సుబ్బమ్మ ఇవ్వాల్సిన అసలువడ్డీ మినహాయించుకుని, మిగతాది ఆమె కిచ్చేయండి."

"ఏమిటీ! నువ్వు వెంకట సుబ్బమ్మను వెనకేసుకొస్తావన్నమాట?"

'మిస్టర్ విజయ్'లో శోభన్‌బాబు, రాధ





'ప్రేమ నక్షత్రం'లో శ్రీదేవి, కృష్ణ

### సినిమా

"లేదు, న్యాయాన్ని ముందుంచుకొస్తాను."

బోస్‌బాబు కలుగజేసుకుంటూ, "అమ్మనీయమ్మ పెద్దపెద్ద మాటలు చెప్తున్నావ్. ఆయన చేసిన అన్యాయం ఏముంది? అప్పిచ్చాడు. వసూలు చేసుకుంటున్నాడు."

రవికి కోపం ఆగిందికాదు. "నోర్ముయ్! గాట్లోకుక్కలాగా మధ్య నీ మొరుగుడేమిటి? ఆవును వదులు!"

"వదలకపోతే?"

"నాలుగుతన్ని మరీ తోలుకెళ్తాను."

"అమ్మనీయమ్మ అంత మగాడివా?" అంటూ బోస్‌బాబు మీసం మెలివేశాడేగాని, రవి దెబ్బలకు తట్టుకోలేక పోయాడు. కాసులయ్య పరారై, ఎక్కడో దాక్కున్నాడు.

రవి, సుబ్బమ్మకు ఆవును అప్పగిస్తూ, "ఈ ఆవును తోలుకెళ్ళు. వీలైనంత త్వరలో వాళ్ళ బాకీ తీర్చేయ్," అన్నాడు.

"అలాగే, బాబూ! మీరు చేసినమేలు మరచిపోలేను, బాబూ!" అంటూ సుబ్బమ్మ తన ఆవును తోలుకుని వెళ్ళింది.

ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించిన మహేశ్వరీ మూవీస్ "బంగారుభూమి" చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

## "కయ్యాల అమ్మాయి — కిలాడి అబ్బాయి"

టి అప్పుదాస్ సమర్పించే శ్రీ దాక్షాయణి క్రియేషన్స్‌వారి పై చిత్రానికి డిసెంబర్ 21న తొలి గీతం రికార్డయింది. కృష్ణ — చక్ర స్వర కల్పనలో వేటూరి గీతాలు రాశారు. భమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలకర్త. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కొండపనేని రామలింగేశ్వరరావు శిల్పం, ఎస్. వి. ఎస్. వీరప్ప కూర్పుతో విజయకృష్ణ కథకుడు, నిర్మాణ సారథి. బి. వెంకటేశ్వరరావు, కత్రి రమణారావు సహనిర్మాతలు రాజ్‌కుమార్ ప్రొడక్షన్స్ ఎగ్జిక్యూటివ్. "జనవరి చివరి వారం నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు నిర్మాత పోమిశెట్టి సుబ్బారావు. ఈ చిత్రానికి చిత్తూరు వెంకటగిరీశ్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## కృష్ణతో కనకధారా ఫిలిమ్స్ చిత్రం

"డాక్టర్ — సినీ యాక్టర్" చిత్ర నిర్మాతలలో ఒకరైన కె. ఎల్. నరసింహులు కనకధారా ఫిలిమ్స్ పతాకంపై త్వరలో ప్రారంభించే చిత్రంలో కృష్ణ కథానాయకుడు. చక్రవర్తి సంగీత దర్శకుడు. ఎ. విద్యాసాగర్‌రెడ్డి తొలిసారిగా దర్శకత్వం వహించే చిత్రమిది.

జీవితంలో మధురస్వప్నాలకు
వాస్తవికతకు జరిగే
రసవత్తర సంఘర్షణ!

కృష్ణంరాజు సమర్పించు



గోపీకృష్ణా మూవీస్

# మధురస్వప్నం

కలర్

దర్శకత్వం కె.రాఘవేంద్రరావు B.A., నిర్మాత: యు.వి.సూర్యనారాయణరాజు

సంగీతం సత్యం కెమెరా కె.యస్.ప్రకాష్

లక్ష్మీ ఫిలింస్

LAKSHMI PUBS.

సీరియల్

# జీవిత వనంలో కొత్తగాలి

కుందుర్తి ఇందిరాదేవి

(గత సంచిక తరువాయి)

ఆ రోజు ఆదివారం. పగలు పదకొండు గంటలా ఇరవై రెండు నిముషాలకు ముహూర్తం. నేను మంచంమీద బోర్లాపడుకుని గడియారాన్ని చూస్తున్నాను. నా కిరణ్ పెళ్ళి. పెళ్ళికూతురి ముస్తాబుతో సిగ్గులొలుకుతూ, స్నేహితురాళ్ళ ఛలోక్తులతో పెళ్ళిపీటలమీద కూర్చోవాల్సిన నేను, జబ్బుపడిన దానిలా, దిక్కులేనిదానిలా మంచంమీద పడుకుని ఉన్నాను.

టైమ్ దగ్గరపడుతున్నకొద్దీ నాలో కసి, కోపం, దుఃఖం కెరటాల్లా ఉవ్వెత్తున లేచిపడుతున్నాయి. నా కిరణ్ నాకు దూరమైపోతున్నాడు. అతను నానుండి శాశ్వతంగా వెళ్ళిపోతున్నాడు. అతనికీ నాకూ ఎటువంటి సంబంధం లేదు. నేను భరించలేకపోతున్నాను.

ఇల్లంతా భయంకరమైన నిశ్శబ్దంతో స్మశానంలా ఉంది. పదకొండు ఇరవై రెండు నిముషాలవుతోంది! నాలో రక్తం మరిగిపోతోంది. కిరణ్ నాకేమీ కాడు. ఇక నాకు అతనికీ ఉన్న ప్రేమబంధం తెగిపోతోంది. పదకొండు ఇరవై రెండు నిముషాలయింది. నేను పిచ్చెక్కినదానిలా చేతిలోకి దిండు తీసుకుని బలంకొద్దీ విసిరేశాను. గడియారం క్రిందపడిపోయి బద్దలైపోయింది. కానీ ఆ ముళ్ళు మాత్రం నన్ను వెక్కిరిస్తున్నట్టుగా తిరుగుతూనే ఉన్నాయి.

"సంధ్యా! ఏంచేస్తున్నావు. తలుపు తెరు" అమ్మ బిగ్గరగా ఏడుస్తూ తలుపు కొడుతోంది.

నేను పిచ్చెక్కినదానిలా నా తల మంచంకేసి కొట్టుకున్నాను. కిటికీలోంచి చూస్తున్న ఫల్గుణ "అక్కా" అనగానే నేను చివ్వునలేచి కిటికీ తలుపులు బద్దలయ్యేలా మూసేశాను. "ఆ జీవితవనం" ద్వారాలు శాశ్వతంగా మూసుకున్నాయి. నాకు అందులో ప్రవేశం దొరకలేదు.

## 26

రోజులు దొర్లిపోతున్నాయి. ఆ షాక్‌నుంచి నేను జీవితంలో తేరుకోలేననే అనుకున్నారు అందరూ. కానీ చిత్రం! నేను కోలుకున్నాను. మామూలుగనే ఆఫీసుకి వెడుతున్నాను. నాలో ఇంత నిబ్బరం ఎలా వచ్చిందో నాకే తెలీదు. కిరణ్ నుంచి రిజిష్టర్ కవర్ వచ్చింది. నేను సంతకం చేసి తీసుకుని ఎందుకైనా మంచిదని తిన్నగా ఇంటికి వచ్చి మంచంమీద పడుకుని చించాను. నా గుండెల్లో ఇంకా ఎందుకో చిత్రమైన స్పందన.

నా సంధ్యా!

నీకు ఇలా లెటర్ వ్రాస్తానని ఏనాడూ అనుకోలేదు. నా అదృష్టం ఇలా ఉంది. నీనుంచి లెటర్ కోసం అనుక్షణం ఎలా ఎదురుచూశానో తెలుసా సంధ్యా! కానీ నువ్వు మాత్రం నువ్వు గీసుకున్న పరిధి దాటి ఒక్క అంగుళంకూడా ఇవతలకి రాలేదు.

సంధ్యా! ఈ మానవజీవితం చాలా చిత్రమైంది. ఏవేవో కలలు కంటాం. చివరికి అవన్నీ నిరాశా సముద్రంలో కలిపేసి నిస్సారమైన జీవితానికి అలవాటుపడతాం. అమ్మకి ఎంత సీరియస్‌గా అయిందో నీకు తెలీదు సంధ్యా. అమ్మ కోసమే కమలని పెళ్ళిచూపులు చూశాను. నీకు బ్రతిమాలుతూ మరీ ఉత్తరం వ్రాశాను.

నా కలలన్నీ నేలరాశావు సంధ్యా. నువ్వు తప్పకుండా పెళ్ళికి ఒప్పుకుంటావని నేను, నువ్వు అంగీకరించవని మా సుగుణా పోట్లాడుకున్నాము. చివరికి నేను ఓడిపోయాను సంధ్యా. ఆఖరికి నువ్వు నన్ను ఒదులుకోడానికి కూడా సిద్ధపడ్డావంటే నువ్వు ఎటువంటి బాధ్యతలకి బందీవో నా కర్థమయింది సంధ్యా.

నువ్వు ఏ సమాధానం చెప్పకుండా, ఎన్నిసార్లు చెప్పకుండా దాటవేసినా చివరికి మౌనంగా ఉండిపోయి నీ నిర్ణయం తెలియపరిచావు. నిన్ను ఏమీ అనటం లేదు సంధ్యా. చివరికి అమ్మ ఆదేశానుసారం పెళ్ళికి ఒప్పుకోమంటే మౌనంగా తలూపి ఇవతలకి వచ్చాను. నా గుండెల్లో చెలరేగే ఈ బాధ నీకు అర్థమవుతుందనుకుంటాను. నేనేం చెయ్యలేని నిస్సహాయుడిని అయ్యాను ఆ క్షణంలో.

సంధ్యా! ఆఖరికి ప్రమీలచేత కూడా నీకు ఉత్తరం వ్రాయించాను. నేను కష్టపడతానని ఈ పెళ్ళికి ఒప్పుకోదని ప్రమీల నాతో వాదించింది. అయితే సంధ్యా నువ్వు పూర్తిగా నన్ను అగాధంలోకి తోసేశావు. మహా కష్టపడితే రెండు సంవత్సరాలు. అంతేగా. కానీ నువ్వు నా జీవితాన్నే నాశనం చేశావు.

నా సంధ్యా! పెళ్ళి పందిట్లో నేను ఎంత ఆనందంగా ఉండాలని ప్రయత్నించినా నా చేతకాలేదు. మనం పెళ్ళి గురించి ఎన్ని కలలు కన్నాం. అవన్నీ చివరికి నాకు కలలుగానే మిగిలిపోయాయి సంధ్యా! పెళ్ళి జరిగింది. పురోహితుడు చెప్పినవన్నీ యాంత్రికంగా చేశాను. అమ్మ కళ్ళల్లో ఎనలేని తృప్తి. కానీ నా మనసు తెలిసిన ఒకే ఒక ప్రాణి ప్రమీల. దాని ముఖంలో ఆనందం అనేది ఏ కోశానా లేదు.

చివరికి అమ్మ పాదాలకి నమస్కరించి లేస్తుంటే ప్రమీల పరిగెత్తుకొచ్చి నీ లెటర్ అందించింది. అది చూడగానే నా గుండెల్లో ఎన్నిరైళ్ళు పరిగెట్టాయో ఎలా చెప్పను సంధ్యా? వెంటనే అమ్మ పిలుస్తున్నా ఆగకుండా, భోజనాలకి లెమ్మని వదిన పిలుస్తున్నా వినిపించుకోకుండా ఇంటికి వచ్చేశాను.

నా సంధ్యా! ఏం చెప్పమంటావు. ఆ లెటర్ చదివి నేను నీళ్ళు కారిపోయాను. ఈ ఉత్తరం కోసమే సంధ్యా నేను ఇన్నిసార్లు, ఇన్ని సంవత్సరాలు ఎదురుచూసింది. కానీ అది చివరికి అన్నీ అయిపోయేక నాకు చేరింది. కనీసం నాకు వెంటనే ట్రంక్ కాల్ చెయ్యకూడదూ. నేను ఏదో ఒకలా ఈ పెళ్ళి తప్పించుకునేవాడిని.

నా సంధ్యా! ఆ ఉత్తరం కనీసం, ఆ తాళి కట్టక ముందు నా కందినా నేను పీటలమీద పెళ్ళయినా చెడగొట్టేవాడిని. ఏదో విధంగా ఆపు చేసేవాడిని నువ్వా లెటర్ ఎందుకు వ్రాశావు సంధ్యా. ఆ ఉత్తరం నన్ను రంపపు కోతకోస్తోంది సంధ్యా. ఇప్పుడు నేనేం చెయ్యను. ఇటు కమలని ఎలా ఒదులుకోగలను? ఒక పక్క కమల, ఇంకో పక్క నువ్వు నాకు మనశ్శాంతి లేకుండాచేస్తున్నారు.

నా సంధ్యా! నేను నిస్సహాయుడిని. నీకు శుభలేఖ పంపగూడదనే అనుకున్నాను. చివరికి నీకు తెలియకుండా పెళ్ళి చేసుకోడం అన్యాయం అనిపించింది. అందుకే చివరికి పంపించాను.

నేను నీకెన్నో ఆశలు పెట్టాను. అవన్నీ నీకు చివరికి కలలుగానే మిగిల్చి వేశాను సంధ్యా. ఏం

**జరిగిన కథ - 13 :** కుటుంబ భారం తనపై వేసి తండ్రి కన్నుమూయగా, సంధ్య ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్ళకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది. ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతుంది. శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్ళి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు. ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్ళి చేసుకొని వెళ్ళిపోవడంతో, దిక్కుతోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య. శశికి ఉద్యోగం వస్తే, తన అత్తగారికి ఇష్టం లేకపోవడంతో చేయనని ఖచ్చితంగా చెప్పేసి వెళ్ళిపోతుంది. కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అవడంతో మరీ కృంగిపోతుంది సంధ్య. సంధ్యా కిరణ్‌లు పెళ్ళి చేసుకోవడం ఇరు కుటుంబాలకూ ఇష్టంలేదు. కిరణ్ వివాహ ఆహ్వాన శుభలేఖ అందుకొని మూర్ఛపోతుంది సంధ్య.

చెయ్యలేని ఈ నిస్సహాయుడిని క్షమించు. కాని నువ్వు ఒక్కటి మాత్రం గుర్తుంచుకో — ఈ పెళ్ళి నా మనసా, వాచా మాత్రం జరగలేదు. కేవలం అమ్మ కోసం చేసుకున్నాను. అది నువ్వు నమ్మినా నమ్మక పోయినా నిజం.

నా ఆశలు, నా కోరికలు నా గుండెల్లోనే శిథిలమైపోయినాయి. నా జీవితవనంలో వసంతం తిరిగి రాదు. కోయిలమ్మ పాటలు వినిపించవు. నా సుఖం నా ఆనందం, నా సరదాలు అన్నీ నువ్వే. నువ్వులేని క్షణం అవి ఆవిరిలాగే అంతమవుతాయి సంధ్యా.

నిన్ను బలవంతాన ప్రేమలోకి లాగి, చివరికి ఒంటరిగా వదిలేసి వచ్చిన అభాగ్యుడిని సంధ్యా. ఎవ్వరేమన్నా, ఎప్పటికైనా నేను నీవాడినే సంధ్యా. ఇక ఆపేస్తున్నాను. ఇప్పటికే నిన్ను చాలా బాధ పెట్టాను. నా కాళ్ళకి చుట్టుకున్న ఈ బంధం నాకు శాశ్వతమైంది. ఇది త్రెంచటం అసంభవం సంధ్యా. నీకు చేతనైతే నన్ను మర్చిపోవటానికి ప్రయత్నించు. నిన్ను శాశించే అధికారం నాకు లేదు. ఉంటానిక. ఎప్పటికీ --

నీ

కిరణ్.

నా కళ్ళల్లో కన్నీళ్ళు కాల్వలు కడుతున్నాయి. నేననుభవించే ఈ బాధకన్నా, నా కిరణ్ బాధ మరీ భయంకరమైనది. నేను శాపగ్రస్తురాలిని. దురదృష్టదేవత నా నెత్తిమీద తాండవ మాడుతోంది.

దీనికి అంతటికి కారణం అమ్మ. నాకు అమ్మ మీద ఆగ్రహం రాసాగింది. ఆవిడ స్వార్థంతో నా జీవితం కూలిపోయింది. ఈ కూలిపోయిన జీవితం తిరిగి పునరుద్ధరింపబడదు. అది అసంభవం. కనీసం నేను శశిలా తెగించినా బాగుండేది. కానీ నాకు అదృష్టం ఏదీ. భగవాన్!

ఆ రాత్రి నేను మూసిన తలుపు తెరవలేదు.

# జీవితవనంలో కొత్తగాలి

తిండి తినలేదు. నా కళ్ళల్లో ఇంకా నీళ్ళు ఎక్కడ ఉన్నాయో! అవిరామంగా ఏడుస్తూనే ఉన్నాను. నిస్సహాయమైన ఈ జీవితంమీద విరక్తి కలగ సాగింది మొదటిసారిగా.

## 27

నా జీవితవనంలో ప్రేమ, మమత, ఆప్యాయత, అనుర్థాగం అనే తాజా గాలుల హఠాత్తుగా మాయమైనాయి. వాటి స్థానంలో స్వార్థపూరితమైన గాలి ప్రవేశించింది. స్వార్థం, కుళ్ళు, ద్వేషం అనే గాలికి నేను గాలి స్తంభించినట్లు, ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాను.

శశి పురిటికి వచ్చింది. బాబు పుట్టాడు. నేను వాళ్ళతో మునుపటిలా మాట్లాడటం ఏనాడో మానివేశాను. ఆ బాబును అసలు చూడలేదు. ముద్దులాడలేదు. అందుకని దానికి నామీద కోపం. పురిటికి ముందు "సూడిదలు తీసుకుపోవాలి సంధ్యా" అని అమ్మ సణిగింది. అమ్మకి ఇప్పుడు నేనంటే హడల్!

"నా దగ్గర డబ్బులేదు" అనేశాను. అమ్మ ఏడిచింది. చివరికి ఒళ్ళుమండిపోయి డబ్బు విసిరి పడేసి వెళ్ళిపోయాను. అలా చేయటం తప్పని తెలుసు. కానీ వీళ్ళంతా నా ఆనందం దోచుకున్న మనుషులు.

వాడికి బారసాల అని మొదలెట్టింది. "నేను ఇప్పటికే నిండు అప్పుల్లో మునిగి ఉన్నాను నావల్ల కాదు" అన్నాను.

"అలాగే ఇంకో నాలుగు వందల రూపాయలు అప్పతే. మళ్ళీ తీర్చుకోవచ్చు" అంది. నేను ఛర్రుమన్నట్టు చూసి "నీ అల్లుడినే తెమ్మను" అనేసి వెళ్ళిపోయాను.

అమ్మ తిట్టుకుంటూ ఉన్నంతలోనే చేసింది. నేను ఆఫీసుకి వెడుతుంటే "సంధ్యా! వాళ్ళ అత్తగారు వస్తారే. నీకు న్యాయం కాదే" అని ఏడిచింది. శశి కళ్ళనీళ్ళు పెట్టుకుని చూడటంతో ఆగిపోక తప్పలేదు. బాబుకి వాసు అని పేరు పెట్టారు.

"వాడికి ఖరీదైన బట్టలేవీ! మెడలో ఒక గొలుసన్నా చేయించలేదేం, చేతికి మురుగులన్నా చేయించద్దూ" అని వాళ్ళ అత్తగారు లా పాయింటు తీసిందని అమ్మ మళ్ళీ నా గొంతుమీద కూర్చుంది.

నేను వెళ్ళి "అవన్నీ వాళ్ళ నాన్న చేయించ గలడులెండి" అని వచ్చేశాను.

శశి విజయవాడ వెళ్ళిపోయింది అయిదో నెల రాగానే. ఎనిమిదో నెల్లో అన్నప్రాసన అంటూ వచ్చింది. వాళ్ళ అత్తగారు స్వయంగా వచ్చి "నువ్వు కూడా రామ్మా" అని మరీ మరీ చెప్పింది. ఒక్కడే కొడుకు కావటంతో ఆవిడ ఇప్పుడు శశిని కూడా బాగానే చూసుకుంటోంది.

ఆ రోజు కరెక్టుగా ప్రమీల కూతురి బారసాల నేను ఆఫీసుకి శెలవుపెట్టి ఓ వెండిగిన్నె కొని వెళ్ళబోయాను. అమ్మ వచ్చింది.

"హమ్మయ్య! సంధ్యా. నువ్వు బయలుదేర



తాపం ఒఎకోలేదే. ఈ సారన్నా మంచి బట్టలు కొనకపోతే చిన్నతనంగా ఉంటుంది. వాడికి చిన్న ఉంగరం కొనమంది శశి. "వెండిగిన్నె ఇవ్వాలి వదినగారు" అని వాళ్ళత్తగారు ముందుగానే ఆర్డరిచ్చింది" అంది వెలిగిపోతున్న ముఖంతో. ఇంట్లో అందరూ అప్పటికే రెడీ అయిపోయారు.

"నేను ప్రమీలా వాళ్ళింటికి వెడుతున్నాను" అని కదలబోయాను.

"సంధ్యా" అమ్మ బిత్తరపోయింది. నేను మాట్లాడలేదు.

"ఈ వెండిగిన్నె శశి కొడుకు కోసం కదూ నువ్వు కొన్నది"

"కాదు."

"ఎంతసేపూ ప్రమీలో అని అఘోరిస్తావు. సొంత చెల్లెలు కొడుక్కి అన్నప్రాసన చేసుకుంటుంటే రాకుండా ఉండటానికి నీకు మనసెలా ఒప్పిందే. పైగా ఎమ్మెల్ని ఒట్టిచేతులు ఊపుకుంటూ వెళ్ళమంటావా" ఆగ్రహంగా, దుఃఖంగా అంది.

"నా దగ్గర డబ్బులేదు."

"ప్రమీల కూతురుకి ఇవ్వడానికి ఎలావచ్చింది?"

"అప్పు చేస్తే వచ్చింది."

"నువ్వు పచ్చి స్వార్థపరురాలివే సంధ్యా."

"అచ్ఛా!" నేను ఆశ్చర్యంగా అన్నాను. అమ్మ ముఖం జేవురించింది. నేను పకపకా నవ్వేస్తూ వెళ్ళిపోయాను.

కిరణ్ నాకు లెటర్స్ వ్రాస్తూనే ఉన్నాడు. ఒకసారి ఇలా వ్రాశాడు –

"సంధ్యా!

నువ్వింకా ఎంతకాలం ఇలా ఉంటావు. నా ఎరుకలో మంచి కుర్రాడు ఉన్నాడు. చాలా బుద్ధిమంతుడు. నువ్వు ఒప్పుకో నువ్వు పెళ్ళి చేసుకుని సుఖంగా ఉంటే నాకు కొంచెం మనశ్శాంతిగా ఉంటుంది. నువ్వు ఇలాగే ఉండిపోయావంటే నేను తప్పుచేసినట్టుగా జీవితాంతం బాధపడాల్సి వస్తుంది. ఆలోచించుకో. నువ్వు కులాసాగా ఉన్నావని ఆశిస్తాను.

– కిరణ్."

నేను నవ్వుకున్నాను. కిరణ్ నా పుట్టిన రోజుకి ఖచ్చితంగా చీర పంపుతాడు. ఆ పుట్టిన రోజు తాలూకు వెనకటి జ్ఞాపకాలతో నేను పగిలిన అగ్నిపర్వతాన్నే అవుతాను. అదో విచిత్రమైన జ్ఞాపకం. అంతే. నా గుండెల్లో భద్రపరచబడిన అపురూపమైన స్మృతి అది.

*　　*　　*

నాకు రెండు రోజులనుంచీ జ్వరం వస్తోంది. ఆ రోజు పత్యం పెట్టారు. మీనాని పిలిచి ప్రమీల ఇంట్లో ఉందేమో ఫోన్ చేసి కనుక్కోమన్నాను. మీనా తిరిగొచ్చి ఉన్నది అని చెప్పింది.

నేను జడ వేసుకుని చెప్పులు వేసుకుంటుంటే– "అక్కా కర్చు ఆడవ్దా" అంది మీనా.

"వద్దులేమ్మా! నువ్వు చదువుకో" అని మళ్ళీ "నన్ను ఆటో ఎక్కించి వద్దువుగాని రా" అన్నాను. మీనా కూడా బయలుదేరింది. నాకు నిద్ర రాకుండా కబుర్లు చెబుతాను అని కాలేజీ ఎగ్గొట్టి ఇంట్లో కూర్చుంది.

అమ్మ ఎదురొచ్చి ఒక డబ్బా ఇస్తూ "సంధ్యా! ఇందులో ఒడియాలు ఉన్నాయి. శశికి ఇవ్వు. 'ఒడియాలు నువ్వు పెడితేనే బాగుంటాయి. పంపించమ్మా' అని నోరుతెరిచి అడిగింది పిచ్చిపిల్ల" అంది.

నేను తక్కున ఆగిపోయాను. శశి ఎన్నిసార్లు కబురు చేసినా నేను వెళ్ళను. అది విజయవాడ వెళ్ళిపోతోందిట. నన్ను రమ్మని మరీ మరీ చెప్పింది. కానీ నేను వెళ్ళలేదు.

"నాకు వేరే పని ఉంది" అన్నాను.

అమ్మలో ఉత్సాహం ఊదేసినట్టుగా మాయమైంది.

"ఓహో! అంతేసి రాచకార్యాలు నీకేమున్నాయి" అంది.

"నేను ప్రమీల దగ్గరకెళ్ళాలి. అది మళ్ళీ ఎల్లుండి వెళ్ళిపోతోంది. రా మీనా" అని కదలబోయాను.

"శశికన్నా ఎక్కువా నీకా ప్రమీల!" కోపంగా అంది.

"నాకీ ప్రపంచంలో ఉన్న ఆత్మీయురాలు ప్రమీల ఒక్కతే" ఖచ్చితంగా అన్నాను.

"అయితే మేం ఎవరం నీకు అక్కర్లేదా? శశి అన్నిసార్లు ఏడిచినా, మొత్తుకున్నా వెళ్ళకుండా ప్రమీల దగ్గర కెడుతున్నావు."

నేనేం మాట్లాడలేదు. తలుపు పట్టుకుని నిరసంగా నిలుచున్నాను. "వాను ఎంత ముద్దొస్తున్నాడని. దొంగభడవ" మురిసిపోతూ అంది.

నేను ముఖం తిప్పేసుకున్నాను.

"అయితే శశి దగ్గరికి వెళ్ళనంటావు."

"వెళ్ళను! వెళ్ళను."

"పోనీ ప్రమీల దగ్గరికెందుకు?"

"మనశ్శాంతి కోసం."

"మనశ్శాంతా" అమ్మ తెల్లబోయింది.

"అవును."

"సంధ్యా" అమ్మ కోపంగా అరిచింది. "నీకు తోబుట్టువులకన్నా ఎక్కువా నీకా ఫ్రెండు" అంది.

నాలో కోపం ఖస్సుమంది.

"అది అక్కా! అక్కా! అని ఎంత ఏడుస్తోందో చూడవే" అంది.

"అచ్ఛా!" నేను నవ్వాను. అమ్మ కోపంగా కేకలేసింది.

"అమ్మా! ఈ ప్రపంచంలో నా ముఖం కోసం తాపత్రయపడేవాళ్ళు ఇద్దరేనమ్మా. నా కిరణ్ మీద అధికారం కావాలనే నేను వదులుకున్నాను. నాకు ప్రమీల తప్పితే ఈ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. నా మనశ్శాంతి ప్రమీల దగ్గర దొరుకుతుంది. ఇక పదేపదే నన్ను విసిగించకు" అన్నాను.

అమ్మ చేతిలో ఒడియాల డబ్బా ధన్మని జారిపడిపోయింది. ఒడియాలన్నీ చెల్లాచెదురుగా పడిపోయాయి. నేను విశ్వేష్టురాలిలా చూస్తున్న అమ్మను లెఖ్ఖ చెయ్యకుండా వచ్చేశాను. నన్ను ఆటో ఎక్కించి మీనా వెళ్ళిపోయింది ఇంటికి.

## 28

"ఏమిటి ప్రమీ! నువ్వంటున్నది?" నేను విభ్రాంతపోయాను.

"అవును సంధ్యా! పాపం వదిన ప్రసవం కష్టమైపోయి చివరికి యమయాతనలు పడి శాశ్వతంగా వెళ్ళిపోయింది. బాబును సుగుణ పెంచుతోంది. దానికి కొడుకుల్లేరు. పెంచుకుంటానంటోంది. అన్నీ ఇచ్చినట్టే ఇచ్చి చివరికి ఏమీ లేకుండా చేశాడు అన్నయ్యకి, భగవంతుడు ఇంత నిర్దయుగా ఎలా ప్రవర్తిస్తాడో" కూతురికి జోకొడుతూ అంటోంది ప్రమీల.

నాకవేమీ వినిపించటంలేదు. కమల చచ్చిపోయిందా!? ఆవిడని నేను ప్రమీల కూతురి












బాలసాలలో చూశాను. ఎంత అన్యోన్యమైన జంట! అనుకున్నాను మనసులో. కిరణ్ నన్ను చూసి మెల్లిగ నవ్వాడు. కమల చొరవగా వచ్చి "మీకు నేనెవరో తెలియదనుకుంటా. మిమ్మల్ని నేనెరుగుదును" అంటే ఎవరా అని తెల్లబోయాను. తెల్లగా అందంగా, నిర్మలంగా ఉన్న ఆవిడ కిరణ్ భార్య అని తెలిసి అవాక్కయిపోయాను.

"మీకు నేనెలా తెలుసు?" అన్నాను అనుమానంగా.

కమల మళ్ళీ అందంగా నవ్వింది. "మీరెంతో అదృష్టవంతులు. మావారికి మీరంటే ఎంత ఆరాధనో! కుటుంబం కోసం కొవ్వొత్తిలా కరిగి పోతోంది—అని ఒకసారి మథనపడ్డారు."

నేను నోరు తెరుచుకుని వింటున్నాను.

"మీ చిత్రాన్ని గీశారు ఆయన. చాలా బాగుంది. ఇదేమిటి ఇలా మాట్లాడుతున్నానేమిటి అనుకుంటున్నారా" అని గలగలా నవ్వుతూ, ఏ మాత్రం ఈర్ష్య లేకుండా చనువుగా మాట్లాడ తుంటే నేను ఆశ్చర్యపోయాను.

అలాంటి కమల చచ్చిపోయిందా? మైగాడ్! పెళ్ళయి మూడేళ్ళు తిరక్కుండానే పోయిందా? నేను నిశ్చేష్టురాలినైపోయాను.

"అన్నయ్య కంపెనీ తరుపున పారిస్ వెడుతున్నాడు. మూడేళ్ళదాకా రాడు. ఏమిటో సంధ్యా. ఇటు నువ్వు చూస్తే ఇలా ఉన్నావు. అటు అన్నయ్య చూస్తే అలా ఉన్నాడు" అని నిట్టూర్చింది.

నేను మాట్లాడకుండా వచ్చేశాను. ఆ రాత్రి నేను తలుపు బిగించుకుని అన్నం కూడా తినకుండా పడుకున్నాను.

మర్నాడు —

నేను ఆఫీసులో పని చేసుకుంటుంటే విమల హఠాత్తుగా — "సంధ్యా! నీ హీరో వచ్చాడే" అంది.

నేను చివ్వున తలెత్తి చూశాను. కిరణ్ నిశ్చలంగా నిలబడి ఉన్నాడు. ఆ ముఖంలో నీలి నీడలు దోబూచులాడుతున్నాయి. డ్రెస్‌లో ఏ మార్పూలేదు. నడుముకి ఉన్న వెడల్పాటి బెల్టు అతన్ని నిటారుగా నిలబెట్టటానికి ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది. నేను ఫైల్స్ సర్దేసి లేచివెళ్ళాను. అతను రాజారావుగారి స్కూటర్ తెచ్చాడు. ఇద్దరం పబ్లిక్ గార్డెన్స్‌కి చేరుకున్నాము. అక్కడి పరిసరాలు, చెట్లూ, పిట్టలూ ఏవీ మారలేదు. మారిందల్లా ఇద్దరి జీవితాలే!

అతనిలో చిందులువేసే చిలిపితనం అస్సలు లేనేలేదు. జీవితంలో అన్నీ పోగొట్టుకున్న బికారిలా ఉన్నాడు. ఇద్దరం మాట్లాడుకోలేదు. చివరికి అతనే అన్నాడు —

"కమల పోయింది సంధ్యా"

నేను నిస్సహాయంగా చూశాను. అతని బాధను నేను అర్థం చేసుకోగలను. కానీ?

"నేను పారిస్ వెడుతున్నాను" నిర్వికారంగా అన్నాడు.

అతనింకా ఏమైనా అంటాడేమో అని చాలాసేపు ఎదురుచూశాను. కానీ నేను ఆశించిన ప్రశ్న మాత్రం లేదు.

"జీవితం చాలా చిత్రాతిచిత్రమైనది సంధ్యా. బుద్బుదప్రాయమైన ఈ జీవితం కోసం ప్రతి మనిషికీ ఎన్ని కోరికలు, ఆశలు, ఎందుకు ఉంటాయో అర్థం కావటంలేదు. అనుకునేది ఒకటి. జరిగేది మరొకటి. కమల పోతూ పోతూ తన గుర్తుగా నాకో బాబుని ఇచ్చింది. సుగుణ పెంచుకుంటోంది. చూశావా మగాడెంత నిస్సహాయుడో! కన్నకొడుకుని కూడా పెంచుకోలేక ఇతరుల కివ్వటం ఎంత నరకం సంధ్యా. నా సంసారం గురించి ఎంతో తాపత్రయపడిన అమ్మ కూడా పోయింది."

నేను కళ్ళు ఆర్పకుండా అతన్నే చూస్తున్నాను. కమల మరణం అతనిలో వేదాంతపు తెర దింపేసింది. అతను బాగా దెబ్బతిన్నాడు.

"జీవితంలో నువ్వు, కమలా ఇద్దరూ అందినట్టే అంది చేజారిపోయారు. చివరికి మిగిలింది. మహా భయంకరమైన శూన్యం. నా జీవితం కేవలం ఇంద్రధనుస్సులాగే మెరిసిపోయింది. చివరికి అది కూడా మాయమైంది. కొంతకాలం దూరంగా పోయి రావాలి. ఈ ఒంటరితనం భరించలేనిది సంధ్యా."

'నీకు నేనున్నాను! నేనున్నాను' అని చెప్పాలని ప్రయత్నించినా ఒక్క మాట బయటకి రాలేదు. నన్ను చుట్టుకుని ఉన్న బంధాలు నా నోరు నొక్కేశాయి. ఈ పార్కులోనే, ఈ ప్రదేశంలోనే కూర్చుని ఎన్నో కబుర్లు చెప్పుకున్నాము. ఎన్నో కలలు కన్నాము. కానీ ఇప్పుడు అవేమీలేవు. ఇద్దరిమధ్యా అంతులేని దూరం ఉంది.

ఇద్దరం లేచాము. హోటల్లో కాఫీ తాగాము. అతను నన్ను ఇంటిదగ్గర డ్రాప్ చేశాడు. "వస్తాను" అన్నాడు.

"కిరణ్" అన్నాను అస్పష్టంగా. "గుడ్‌బై" స్కూటర్ వెళ్ళిపోయింది. నేను ఆ రాత్రంతా తెగ ఏడిచాను.

## 29

కిరణ్ ఫారెన్ వెళ్ళిపోయాడు. నన్ను నా జ్ఞాపకాలలోనే, సుందరమైన స్వప్నాలలో బ్రతకమని ఒంటరిగా వెళ్ళిపోయాడు. నా గుండెల్లో గూడు కట్టుకున్న కోరికలు, దురదృష్టమనే పెనుతుఫాను తాకిడికి విరిగిపోయి, చెల్లా చెదరయిపోతున్నాయి. నా కమ్మటి కలలు నా కన్నీటి సముద్రంలో నిస్సహాయంగా కలిసిపోతున్నాయి. వాటి ఆక్రందన ఆ పెనుతుఫానుల హోరులో వినిపించటంలేదు.

ఫల్గుణ హౌస్ సర్జన్ చేస్తున్నాడు. అమ్మ నాకోసారి పెళ్ళి సంబంధం తెచ్చింది. "నువ్వు ఓ ఇంటిదానివైతే నాకు నిశ్చింతే సంధ్యా" అంది. సమాధానంగా నేను కంచంలో చేయి కడుక్కుని వచ్చేశాను. ఒకసారి ఫల్గుణ అమ్మతో "అక్కకి తప్పకుండా మరో సంబంధం చూసి పెళ్ళి చేస్తానమ్మా" అంటుంటే 'నా తమ్ముడు' అని మనసులోనే గర్వపడ్డాను.

ఒకరోజు నా కెందుకో బద్ధకంగా ఉండి ఆఫీసుకి ఆలస్యంగా బయలుదేరాను. బ్యాగ్ తీసుకుని చేతికి వాచీ పెట్టుకుంటూ గుమ్మం దాటబోయి చప్పున ఆగిపోయాను

"ఎవరికి చెప్పేది ... ఏమని చెప్పేది ... హోరున వీచే గాలికా చిరుగాలికా ... ఉరకలు వేసే నీటికా ... సెలయేటికా" అని హుషారుగా పాడుకుంటూ మెట్లెక్కి రాబోయిన ఉష నన్ను చూసి తక్కున ఆగిపోయింది. కళ్ళు రెపరెపలాడినాయి

"నోరు వాయిలేని వాటికి చెప్తే అర్థం కాదులేగానీ నాకు చెప్పు వింటాను. నీకిప్పుడు కాలేజీలేదా ఇంటికి వచ్చావు" అన్నాను.

"లే ... లే . లేదు" ఖంగారుగా అంది.

నేను అనుమానంగా చూశాను. దాని భుజాని కున్న పుస్తకాల బ్యాగ్ నా అనుమానాన్ని మరింత బలపరిచింది.

"ఏం ... ఎందుకులేదు" అన్నాను. ఈ సమయంలో నేను ఇంట్లో ఉంటాననుకోలేదు అందుకే ఉష ధైర్యంగా ఇంటికి వచ్చింది.

## జీవితవనంలో కొత్తగాలి

"సె...సెలవు."

"మరి మీనా ఏది ?"

"నా...నాకు తెలీదు" ఉష ఎందుకో తంగారు పడుతోంది.

"సెలవయితే కాలేజీకి ఎందుకు వెళ్ళావు ?"

"మ...మ...మర్చిపోయాను."

"మర్చిపోయావా ! ఈ రోజు పండగ కాదే! పబ్లిక్ హాలిడే కాదు. మరి నీకు ఒక్కదానికే సెలవు ఇచ్చారా ?" అన్నాను కోపంగా.

ఉష నిస్సహాయంగా చూసింది పయిటెంగు నలుపుకుంటూ.

"నీకు ఎందుకు కాలేజీ లేదో కనుక్కుంటాను పద" అన్నాను.

"అక్కా ! వద్దు వద్దు ! నేను బస్‌స్టాప్‌లో నిలబడి నువ్వు ఇట్లో ఉండవని తిరిగివచ్చాను" అంది ఏడుపుముఖంతో.

"ఎందుకు వచ్చావు ?"

"త...తల... కాదు...కాదు కడుపు నొప్పిగా ఉంది."

"అచ్ఛా !" నేను నవ్వాను.

"ఇంకెప్పుడు ఇలా ఎగ్గొట్టనక్కా. ఒట్టు" అంది.

"అచ్ఛా !" నేనీసారి బిగ్గరగా నవ్వటంతో అమ్మ ఉషని మందలించి కాలేజీకి వెళ్ళమంది. ఉష మేకపిల్లలా బయలుదేరింది. నేనూ కాలేజీకి వస్తాను అంటే ఉష గోలపెట్టింది. అయినా నేను వినలేదు. నా సందేహం తీర్చుకోకుండా వెళ్ళదలుచుకోలేదు.

కాలేజీకి వెళ్ళగానే క్లాస్‌రూమ్‌కి వెళ్ళబోతున్న భారతీదేవిగారు ఆగి "హల్లో సంధ్యా! ఏమిటి ఇల వచ్చావు ?" అని పలకరించింది.

"చూడండి మేడమ్. ఈ రోజు కాలేజీ లేదు అని మా ఉష ఇంటికి వచ్చింది. ఎందుకు లేదో కనుక్కుందామని వచ్చాను" అన్నాను.

"ఏమిటి ఉషా! నువ్వసలు ఈమధ్య సరిగ్గా క్లాసుకి రావటంలేదు. ఎగ్గొట్టి సినిమాలకి పోతున్నావా ?" అంది మేడమ్.

అమ్మఉషా ! దీనికి అవలక్షణాలన్నీ అబ్బినాయ్ అనుకున్నాను మనసులో.

"ఏమిటి రోజూ కాలేజీ ఎగ్గొడుతున్నావ" అన్నాను కోపంగా. ఉష మాట్లాడలేదు. తల వంచుకుంది.

"ఎప్పుడైనా ఒక్కరోజయినాసరే కాలేజీకి రాకపోతే నాకు ఫోన్‌చేసి చెప్పండి మేడమ్" అన్నాను నా ఫోన్ నెంబరిస్తూ. భారతీదేవిగారు అంగీకరిస్తూ "అలాగే సంధ్యా ! నాకు రోజూ వీళ్ళ క్లాసు ఉంటుంది" అంది. ఉష క్లాసుకి వెళ్ళిపోయింది.

ఉష ఎందుకలా చేస్తుందో నా కర్థంకాలేదు. వికలమైన మనస్సుతో ఆఫీసుకి వెళ్ళిపోయాను.

నెలరోజుల అనంతరం :—

నేను కోఠీ సెంటర్‌లో పని ఉండి వచ్చాను. విమల వెళ్ళిపోయింది. నేను బస్ స్టాప్‌లో నిలబడ్డాను. బస్ కోసం చూస్తున్న నా కళ్ళు హఠాత్తుగా ఒకచోట ఆగిపోయాయి. మైగాడ్ ఉష ! పక్కన ఎవరతను ? నా చేతుల్లో చెమట పడుతోంది. ఏదో అంటూ ఇటు చూసిన ఉష

---

## టీ, త్రాగండి

బస్సు స్టాపు వంద గజాల దూరం !
'అక్కడి కేమి తీసుకుంటా వచ్చి'
అన్నాడు, బాటసారి, నడువలేక;
"ముప్పావులా !" అన్నాడు ధీమాగా
రిక్షా డ్రైవరు;
'ముప్ఫై పైసలు,' అన్నాడు
న్యాయంగా అడిగినట్లుగా బాటసారి.
"మీరే, టీ, త్రాగండి, ఆ డబ్బులతో"
అని, అతగాడు, విసురుగా వెళ్లిపోయాడు.

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

---

చప్పున ఆగిపోయింది. తర్వాత వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకున్నారో ఏమో? ఉష నా దగ్గరికి వచ్చింది. ఇద్దరం ఇంటికి వెళ్ళాము. దానికి అంత ధైర్యం, అంత తెగింపు ఎక్కడినుంచి వచ్చాయో నా వెనకాలే గదిలోకి వచ్చింది.

"సంజాయిషీ ఇవ్వడానికి వచ్చావా" అన్నాను మంచంమీద కూర్చుంటూ.

"నన్ను క్షమించక్కా" అంది.

"ఇంతకీ ఏ బాపతు" అన్నాను.

"అక్కా !" ఉష రోషంగా చూసింది

"గట్టిగా అరవకు. మన జాతివాడేనా" అన్నాను.

"కాదు."

"అచ్ఛా !" నవ్వాను.

"చాలామంచివాడు."

"అచ్ఛా !"

"నన్ను పెళ్ళి చేసుకుంటా నన్నాడు."

"అచ్ఛా ! ఇంటర్ కాస్ట్ మ్యారేజ్."

"ఈ కులాలమీద నాకు నమ్మకంలేదు."

"ఐసీ !"

"నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా పెళ్ళి చేసుకునేది ఖాయం" ఉష వెళ్ళిపోయింది. నేను మంచంమీద పడుకున్నాను. శశికన్నా ఉష రెండాకులు ఎక్కువే చదివింది. ఈ ఇద్దరికున్న ధైర్యంలో నూరోవంతు నాకు లేదు.

"నీకు ఎప్పుడూ నేను గుర్తు ఉండేటట్లు చేసే బహుమతి" అంటూ ఆ జీవితవనం ఆర్ట్ నా కిచ్చాడు. చివరికి అతని గుర్తుగా నాకు మిగిలింది అదే. ఆ జీవితవనం ద్వారాలు శాశ్వతంగా మూసుకుపోయినాయి. నా జీవితవనం మోడయి పోయింది. అందులో వసంతకాలం రాదు. లేచిగుళ్ళు తినే గండుకోయిల కుహూ, కుహూలు వినిపించవు. తుమ్మెదల ఝుంకారాలు వినిపించవు అవన్నీ నా గుండెల్లో మూగగా ఉండిపోయాయి. నా జీవిత వనంలో గాలి కలుషితమైపోయింది. హఠాత్తుగా భయంకరమైన ఒంటరితనం రాక్షసిలా నన్ను వెంటాడసాగింది.

(ఇంకా వుంది)

# కేన్సర్ వ్యాధి : కథా కమామిషూ !



అంగుటి కాన్సర్ — ముక్కు కాన్సర్

కేన్సరును "పుట్టకురుపు" అనికూడా అంటారు. మన శరీరంలోని ప్రతి అవయవము అనేక మిలియన్ల కణజాలములతో నిర్మాణమై వుంటుంది. సాధారణంగా ఆరోగ్యకరమైన కణం జనించి తన పని పూర్తిగావించి, వేరొక క్రొత్త కణంచే తొలగించబడుతుంది. ఆ క్రొత్త కణములు మరల క్రమపద్ధతిలో విభజన చెంది పెరుగుతుంటాయి. కొన్ని కొన్ని సమయాల్లో శరీరంలో ఈ కణములు అత్యంత వేగంగా క్రమం లేకుండా విభజన చెంది వూరికే పెరిగిపోయి ఒక "గడ్డ" లేక "వుండు"లా మారి అంతటితో ఆగకుండా తమ యిరుగు పొరుగు కణములను నాశనముచేసే గుణమును కలిగి అక్కడి నుంచి మిగతా శరీర భాగములకు ఉధృతంగా వ్యాప్తి చెందుతాయి. దీనినే "కేన్సర్" అంటారు. దీని మూలంగా దేహం కృశించి శరీర యంత్రాంగం స్తంభించిపోయి మరణం అతిత్వరగా సంభవిస్తుంది.

ఈ కేన్సరు వ్యాధి ఎలా వస్తుందో చెప్పడానికి సరియైన కారణాలు ఖచ్చితంగా లేవు. కాని ఈ వ్యాధికి దోహదం చేస్తున్న కొన్ని పరిస్థితుల, అలవాట్లు ఉన్నాయి. మూడు వందల సంవత్సరముల క్రితమే ఈ కేన్సరు వ్యాధి దీర్ఘకాలిక, బాహ్యప్రేరణ, రాపిడి, ఉష్ణప్రసారమువల్ల కలుగుతుందని కనుగొన్నారు. అతిశీతల ప్రాంతమైన కాశ్మీరునాములు నిప్పు కుండలోపెట్టి వేడికోసము బొడ్డుక్రిందుగా కట్టుకుంటారు. అక్కడ నిత్యం ఆ వేడి, ఒరిపిడి కేన్సరుకు దారితీయుట గమనించారు. అదే విధంగా మన రాష్ట్రంలో కోస్తా ప్రాంతాలైన విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో చుట్ట త్రాగే పద్ధతిలో ఒక విశేషం కనిపిస్తుంది. కాల్చిన చుట్టకొనను నోటిలో పెట్టుకుని పొగ త్రాగుతారు. దీనినే "అడ్డపొగ" అంటారు. ఈ అలవాటువల్ల అంగుటిలో కేన్సరు వస్తుందని శాస్త్రీయంగా రుజువు చేశారు. అలాగే వాడిగావున్న పండ్లకి సన్నిహిత భాగాలైన నాలుక దవుడలకు నిత్యం ఒరిపిడి కలగటంవల్ల, గడ్డం గీసుకొన్నేప్పుడు, గడ్డంపై ఉన్న పురిపిటికాయులు, మొటిమలు మున్నగునవి రోజూ మరల మరల తెగుట మూలంగానూ, స్తనాలని యిరుకైన బ్రాసరీలతో ఎక్కువ కాలం బిగువుగా కట్టి ఉంచడంవల్ల, ఈ రకంగా దేహంలో ఏ భాగంకైనా, యిలాంటి రాపిడి అనునిత్యం కలిగిస్తుంటే ఆయా భాగాలకు కేన్సరు రావచ్చు.

కల్తీలు, నిలువ వుంచిన సరుకులను వుపయోగించటం, వాతావరణ కాలుష్యం, విషా వస్తువులని ఎక్కువగా సేవించడం మొదలైనవి కేన్సరుకి పూలబాట! ముఖ్యంగ పొగ త్రాగేవారు ఈ కేన్సరుకు దగ్గర బంధువులు! పొగ త్రాగేవారు విడిచిన పొగను వారిచుట్టుప్రక్కలనున్నవారు పీల్చుట వలన కూడా మిగతావారికి హాని కలుగుతుంది.

ఇకపోతే ఆస్ట్రేలియాలో ఎక్కువ కాలము ఎండలో పనిచేసే తెల్లని దేహచ్ఛాయగల రైతులలోను, చేపలు పట్టేవారిలోను చర్మానికి కేన్సరు రావటం గమనించడంతో ఎక్కువగా ఎండలో ఉండటం కూడా కేన్సరు రావడానికి ఒక కారణం అంటున్నారు శాస్త్రజ్ఞులు. అయితే ఇది ఉష్ణదేశాలవారికి అంతగా వర్తించదు. గనులలో, రసాయనిక ద్రవ్యములను విరివిగా ఉపయోగించే ఫ్యాక్టరీలు, "ఎక్స్-రే" కిరణాలు వాడే గదులలో పని చేసేవారికి సరియైన రక్షణ లేకుంటే కేన్సరుకు గురువుగా వారు లోనయ్యే ప్రమాదాలున్నాయి.

స్త్రీలలో మర్మావయవములు శుభ్రంగా ఉంచుకొనకపోవడం, ఎక్కువ సంతానము, రతిలో అతి తక్కువ వయస్సులోనే పాల్గొనటము మరికొన్ని కారణాలుగా చెప్పబడుచున్నవి పురుషులలో పురుషాంగానికి ముందున్న చర్మాన్ని వెనుకకు తీసి ప్రతిరోజూ పరిశుభ్రము చేసుకుంటూ ఉండాలి. ఆ చర్మాన్ని సున్తీవంటి ఆపరేషను చేసి తీసివేస్తే చాలా మంచిది. ఎందుకంటే హిందువుల్లోకంటే, బాల్యంలోనే సున్తీచేసి ఆ చర్మాన్ని తీసివేసిన మహమ్మదీయులలో పురుషాంగానికి కేన్సరు రావటము చాలా అరుదుగా కన్పిస్తుంది.

మనదేశంలో స్త్రీలలో రొమ్ము కేన్సరు అత్యధిక సంఖ్యలో కన్పిస్తుంది. ఈ వ్యాధి మొదట రొమ్ములో "గడ్డ" లేక "కాయ"తో మొదలై నెమ్మదిగా పెరుగుతూ ఉంటుంది. నొప్పి ఉండకపోవచ్చు. అయితే రొమ్ములో కన్పించే ప్రతీ కాయ కేన్సరు కానవసరములేదు. కొన్నికాయులు ఏ విధమైన హానిలేకుండా ఏళ్ళతరబడి వుండవచ్చు. స్త్రీలు అరచేతితో తడుముకుంటే ఎటువంటి కాయలున్నా తెలుసుకొనవచ్చు. ఈ విషయంలో ఏ విధమైన అనుమానము కలిగినా 'నొప్పిలేదు కదా' అని అశ్రద్ధ చేయకుండా తక్షణం వైద్యుని సంప్రదించాలి. వైద్యులు పరీక్షచేసి అది కేన్సరు అవునో కాదో నిర్ధారణ చేస్తారు. ఒకవేళ అది కేన్సరు అని మొదటి దశలోనే కనుగొనడం జరిగి వైద్యం ప్రారంభించితే ప్రమాదమునుంచి బయటపడవచ్చు.

యోనిద్వారా తెలుపు ఏ మాత్రము ఎక్కువ కనిపించినా అశ్రద్ధ చేయకుండా గైనికాలజిస్టును సంప్రదించాలి.

ఈ కేన్సరు వచ్చేముందు కన్పించే ప్రమాద సూచికలు :— మానకుండా ఉన్న వుండు, అంటే సాధారణమైన మందులు వాడినప్పటికి వుండు నెల రోజులల్లో నయము కాకపోవటము. ఎదుగుచున్న గడ్డ. శరీరములో ఏ భాగములోనైనా ముఖ్యముగా స్తనములలో ఈ గడ్డ నొప్పిలేకుండా ఉండుట గమనించవలసిన విషయము. అసహజమైన రక్తస్రావము అంటే శరీరంలో ఏ భాగము నుంచి అయినా నెత్తురు రావటము. ముఖ్యముగా స్త్రీలకు ముట్లు ఎండిపోయిన తరువాత మళ్ళీ రక్తస్రావము, లేక తెలుపు ఎరుపు కనిపిస్తే వెంటనే డాక్టరును సంప్రదించాలి.

ఉరిపిలికాయులు, లేక కంతులెదుగుచున్న కొన్ని భాగాలలో కందికాయలు, పుట్టుమచ్చలు అని కూడా వీటిని వ్యవహరిస్తూంటారు. మింగుట కష్టముగా ఉన్నప్పుడు, తగ్గక అజీర్ణవ్యాధి ఉన్నప్పుడు, గొంతు బొంగురుపోయి తగ్గకున్నప్పుడు — పైన తెలిపిన ప్రమాద సూచికలలో ఏ ఒకటి కన్పించినా అది కేన్సరు కావచ్చు. అందుకే అశ్రద్ధ చేయకుండా వెంటనే డాక్టరును సంప్రదించాలి.

కేరళ జనాభాలో ప్రతి ఐదువందల మందిలో ఒకరు కేన్సరు వ్యాధితో బాధపడుతున్నారు. వీరిలో ముప్పదిఐదు శాతము నోటి కేన్సరు. తమలపాకులో పొగాకు తినే అలవాటు దీనికి కారణము అని తేలింది కనుక నోటియందు కేన్సరు రాకుండా ఉండేందుకు చక్క, వక్కపొడి, కిళ్ళీలు, పొగాకు ఎక్కువగా నమలకూడదు. అడ్డపొగత్రాగుట, సిగరెట్లు, బీడీలు, చుట్టలు కాల్చుట వంటి దురలవాట్లు మానుకోవాలి. సిగరెట్లు రేడియో ధార్మిక శక్తిగల "పొలోనియం"ను కలిగి ఉన్నవి.

చిగుళ్ళు దంతములను శుభ్రముగా ఉంచుకొనవలెను. నోటిలో పిప్పిపన్ను, విరిగిన పన్ను ఉన్నట్లయితే దాన్ని పూర్తిగా తీయించుకోవాలి. పండ్లువాడిగా ఉంటే దంతవైద్యుని సంప్రదించాలి షాంపూలు, ఇతరకాస్మోటిక్స్‌ను ఎక్కువగావాడేవారికి కేన్సరువ్యాధి సోకే ప్రమాదము ఉన్నదని అమెరికన్ డాక్టర్లు హెచ్చరిస్తున్నారు. అందుచేత కాస్మోటిక్స్, షాంపూల వాడుకను వీలైనంత తగ్గించుకోవాలి.

గర్భసంచి, యోని ముఖద్వారము నుండి అసహజంగ రక్తము స్రవించినచో వెంటనే వైద్యుని సంప్రదించాలి. కాన్పు సమయాలలో మర్మావయవములు తెగినచో అశ్రద్ధ చేయక సరియైన వైద్యము చేయించాలి.

ఉదరకోశమునకు కేన్సరు రాకుండా ఉండాలంటే అతి వేడిపదార్థములు సేవించరాదు. కారము, మసాలా ఎక్కువ మోతాదులో తీసుకొనకూడదు. శరీరము పరిశుభ్రముగ ఉంచుకోవాలి. వీలున్నంత వరకు స్వచ్ఛమైన గాలి పీల్చాలి. కర్మాగారాల్లో పనిచేసేవారికి తగు రక్షణలు కల్పించాలి. తరచు వైద్య పరీక్షలు చేయించాలి.

ప్రభుత్వము ఈ కేన్సరు ప్రమాదము గురించి వివిధ ప్రచార సాధనముల ద్వారా ప్రజలకి బాగా తెలియజేయాలి. ప్రజలు కూడా సహకరిస్తే ఈ కాన్సర్ వ్యాధి రాకుండా కాపాడుకోవచ్చు.

—డా॥ కూటికుప్పల సూర్యారావు

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

# నిస్సహాయులకు చేయూత



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)

వికలాంగుల అంతర్జాతీయ సంవత్సరం తరుణంలో రాష్ట్రం లోని వికలాంగులకు ప్రత్యేకముగా ఆర్థిక సహాయక కార్పొరేషన్‌ను ఏర్పాటు చేయడం ద్వారా ఆంధ్రప్రదేశ్ ఇతర రాష్ట్రాలకన్నా అగ్రగామిగా ఉంది. రాష్ట్ర ప్రభుత్వం అమలు జరుపుతున్న కార్యక్రమాల వివరాలు దిగువ ఇవ్వడం జరిగింది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

★ ప్రస్తుత సంవత్సరంలో రు. 3 కోట్ల ఖర్చుతో సంక్షేమకార్యక్రమాలఅమలు.

★ 1981–82 సంవత్సరంలో రు. 70 లక్షల ఖర్చుతో కృత్రిమ అంగాలు, విద్యా సౌకర్యాలు, వైద్య చికిత్స సౌకర్యాల కల్పన.

★ మరో 10 సంవత్సరాలవరకు ఉద్యోగాల రిజర్వేషన్ కొనసాగింపు.

★ వికలాంగుల ప్రయోజనార్థం హైదరాబాద్, కరీంనగర్, మెదక్, విజయవాడలలో శిక్షణతోకూడిన ఉత్పత్తి కేంద్రాల ఏర్పాటు.

★ స్వయం ఉపాధి నిమిత్తం రు. 3,000 ల వరకు ఆర్థిక సహాయము.

కులతత్వం వరకట్నం వంటి సాంఘిక దురాచారాలకు గురి అయినవారికి తోడ్పడడంలోకూడా రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహిస్తోంది.

★ అంటరాని తనం, హరిజనులపై అత్యాచారాల కేసుల విషయంలో తీవ్రమైన చర్యలు తీసుకోడానికి వీలుగా సంచారకోర్టులను ఏర్పాటు చేశారు.

★ వర్ణాంతర వివాహాలు చేసుకున్న దంపతులకు నగదు ప్రోత్సాహకాలను అందజేస్తున్నారు.

★ వరకట్న నిషేధ చట్టాన్ని పటిష్టముగా అమలు జరుపుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ లో ఈనాడు వికలాంగులు, సాంఘిక దురాచారాలకు గురైనవారు నిస్సహాయస్థితిలో లేరు. ప్రభుత్వం అందజేస్తున్న చేయూతతో వారు ఉజ్జ్వల భవిష్యత్ కోసం ముందడుగు వేస్తున్నారు.

ADVT NO. 56

సమాచార, పౌర సంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No. 52431 Advt-1/C3/81

## మతాచారం !

భారతదేశంలో కొన్ని చోట్ల వున్న ముస్లిములు తమ మతాచారాలను పాటించడంలో చాలా మెలకువగావుంటున్నారట, నాగపూర్‌లో సినిమాకు వెళ్ళిన ముగ్గురు అమ్మాయిలకూ, తలో యాభయి రూపాయల జరిమానా అపరాధం విధించిందట ముస్లిము ఫండమెంటలిస్టు ఆర్గనైజేషన్. ముస్లిము మతం వయస్సు వచ్చిన, వయస్సులోవున్న ఆడవారిని సినిమాలకు, పార్కులకు, సర్కసులకు, బజారుకు, బయటకు వెళ్ళ ఒప్పదట.

## రసగుల్లా వీరుడు !

కలకత్తాలో నావీ కారి వాల్‌లో నవంబరు 21న పెట్టిన ఈటింగ్ కాంపిటీషనులో 24 ఏళ్ళ రాజారాయ్ అనే ఉత్సాహవంతుడు రెండు నిమిషాలలో ముప్ఫయి రెండు రసగుల్లాలు గుటకాయస్వాహా చేసి ప్రథమ బహుమతినందుకున్నాడట.

## దీని భావమేమి ?!

కేరళమెడికల్ కాలేజీలో యం.బి.బి.ఎస్.లో చేరడానికి జరిగిన పరీక్షలో ఉత్తీర్ణుడయి, సీటు సంపాదించిన ఒకవిద్యార్థికి ఆ పరీక్షలో వచ్చిన మార్కులు చూసి కేరళ హైకోర్టు కొయ్యబారి పోయిందట. ఫిజిక్సు, కెమిస్ట్రీ, బోటనీలో ఆ విద్యార్థికి సున్నా మార్కులు, జువాలజీలో రెండే రెండు మార్కులు వచ్చాయట. అయినా ఎం.బి.బి.యస్. సీటు అతని కొచ్చిందట.!

## చచ్చి బ్రతికిన మనిషి !

లక్నోలో ముషిర్ అనే వో ధనికునింట పని చేస్తున్న అరవై య్యేళ్ళ బ రెహ్మాన్ అనే వ్యక్తికి అనారోగ్యం వస్తే ఆ ముషిర్ అతన్ని బలరాంపట ఆసుపత్రిలోని ఎమర్జెన్సి వార్డులో చేర్చాడట. అక్కడి డాక్టరాతన్ని పరిశీలించి ఆ బ రెహ్మాన్ చనిపోయినట్టు ప్రకటించి, శవాన్నిశవాల గదికి మార్చేశాడట. అయ్యో పాపమని అతని అంత్యక్రియలకు ఆ ముషిర్ అన్ని ఏర్పాట్లూ చేయించి శవాన్ని తీసుకుపోడానికి ఆసుపత్రికి వచ్చి, పర్మిషను తీసుకుని ఆ శవాలగదిలోకి తగిన పరివారంతో వెళ్ళి అక్కడి దృశ్యం చూసి, నిశ్చేష్టుడై పోయాడట. బ రెహ్మాన్ ఆ శవాల గదిలో ఎంచక్కా కూర్చుని వున్నాడట. దెయ్యమా అని భయపడ, కొంతట్లో తీర్మానించుకుని అతన్ని తీసుకుని బయటికొచ్చి ఆ యజమాని తగు వైద్య సహాయం చేయించాడట.

## ముద్దు ముచ్చట !

ముద్దు వద్దనరాదనీ, ముద్దే ఆరోగ్యానికి, సుఖ జీవనానికి కారణమని, ముద్దులో వో రకం మత్తుందనీ, ఉదయాన్న లేచి, కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకు బయలేరే ముందు ముద్దుచ్చుకున్న ఆఫీసరు ఆఫీసులో చకచకలాడి పోతూంటాడనీ, వచ్చే ముందు శ్రీమతితో చివాట్లుతిన్న [లేక పెట్టిన] ఆఫీసరు ఆఫీసులో చిమచిమలాడి సీరుకారి పోతూంటాడనీ వో మనోవిశ్లేషకవేత్త అన్నారట. టాక్సి డ్రైవరులు ఇంట్లో ఒక్కటి ముద్దు పుచ్చుకుంటేండ్లో ప్రమాదాలు తక్కువవుతాయని, అలాగే విమాన చోదకుడు ప్రజా శ్రేయస్సు దృష్ట్యా అదే పని చేస్తే మంచిదనీ, పెళ్ళి కాకపోతే ముద్దోటి అప్పుచ్చుకున్నా ఫర్లేదనీ ఆయన అన్నారట !

## రిటైరింగ్ రూములో రాసక్రీడలు !

న్యూఢిల్లీ రైల్వే స్టేషనులోని రిటైరింగురూముల కేవలం రహస్య వేశ్యానిలయాలుగా అతి చా చక్యంగా నడపబడుతున్నాయట. కలావతి అనే ఆయా వీటికి నాయకురాలిగా పని చేస్తోందనీ, అమ్మాయితో వెళ్ళిన అబ్బాయికి అక్కడ సర్వ వసతులతో [బెడ్డు వసతితోసహా] గది దొరుకుతుందనీ, నంటరిగా వెళ్ళిన అబ్బాయికి అమ్మాయితో సహా అన్నీలభ్యమవుతున్నాయనీ వో అష్టముఖ బ్రహ్మ బయట పెట్టారు.

## ప్రజలకే అవమానం !

మనదేశపు పార్లమెంటు గౌరవం రాన్రానూ భగ్నమై తగులబడిపోతోందనీ, అందులో కూర్చున్న పాలన వర్గపువారు, వ్యతిరేక వర్గపు వారూ హీనంగా, న్యూనంగా అసభ్యంగా, అనుచితంగా మాటీపోటీ మాటలనుకోడాలతో, అరుచుకోడాలతో, బల్లల మీద దబదబ బాదడాలతో కాలం వెళ్ళ బుచ్చుతూ సభా మర్యాదను సభానాయకుణ్ణి పూర్తిగా కించ పరుస్తూ రాజ్యాంగ వ్యవస్థనూ, ప్రజలనూ కూడా అవమానిస్తున్నారనీ వో ఆర్యుడు అంటూ పార్లమెంటు నడుస్తున్నప్పుడు నిముషానికి సుమారు తొమ్మిది వందల రూపాయలు ప్రభుత్వానికి ఖర్చవుతుందని ప్రకటించారట— బాపురే ! గంటకు ఐదువేల నాలుగొందలు ఖర్చా !

## స్కూలు గదికి పట్టిన గతి !

ఒంగోలు ప్రకాశం ఎలిమెంటరీ స్కూలులో వో గదిని విద్యార్థులు "ఒంటేళ్ళ గది"గా మార్చి జామ్మని ఆగదిలో లఘుశంకలు తీర్చుకుంటున్నారట. మున్సిపల్ చైర్మన్ గారొచ్చి అది చూసి అదిరి పడ్డారట.

## ప్రధాన న్యాయమూర్తి సమయస్ఫూర్తి !

మద్రాసు రాష్ట్రంలో కల్లు, సారాయి అంగళ్ళకు లైసెన్సులిచ్చిన విధానాన్ని పరిశీలిస్తున్న భారత దేశ ప్రధాన న్యాయమూర్తి శ్రీచంద్రచూడ్ సభలో న్యాయవాదుల కలకలానికి కారణం అర్థం చేసుకుని "అయ్యా! క్రికెట్ స్కోరు చెప్తున్నాను వినండ" అని చెప్పి స్కోరు వివరాలు చెప్పి "ఇప్పుడు మీ మనస్సు శాంతించిందనుకుంటాను. మన పనికానిద్దామా" అన్నారట.

## రోగాన్ని అంటించిన డాక్టరు !

అలెప్పి (కేరళ) లో కొంతమంది మగవారికి కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు వో డాక్టరు గారు జరిపితే ఆపరేషను చేయించుకున్న వారందరికి ఒకేరకం ఇన్‌ఫెక్షను వచ్చిందట. ఏమాశ్చర్యమిది అని మెడికల్ కాలేజీ పాథాలజీ, మైక్రో బయాలజీశాఖలు పరీక్షిస్తే ఆ ఇన్‌ఫెక్షను కు కారణం ఆ ఆపరేషన్లు చేసిన డాక్టరుగారేనని తేలిందట.








సుమతి, రామేశంల దాంపత్యం చూస్తుంటే, కాడికి కట్టిన ఒంగోలు జాతి జోడెద్దులు గుర్తుకొస్తాయి. వొక్క విషయంలో తప్ప అన్ని విషయాల్లోను సరికి సరి పుజ్జీ

వస్తుతః యిద్దరూ ధనవంతులు, రూపవంతులు, ఆరోగ్యవంతులు, విద్యావంతులు. రామేశానికి ఏదో ఆఫీసరు వుద్యోగం. తల్చుకొంటే సుమతి కూడా వుద్యోగం సంపాదించేదే. కానీ భార్యా భర్తలు యిద్దరు వుద్యోగాలు చేస్తూ కూర్చుంటే యింట్లో ఎన్ని యిబ్బందులు? బదలీలు...ఎడబాటులు ...పైగా పనిమనుష్యులకని, వంటమనుష్యులకని ఎక్స్‌ట్రా ఖర్చు. అంచేత ఆమె పుట్టింట్లో చిన్ననాటి అనుభవాలు గుర్తు చేసుకొంది. పాలు పెరుగులు అమ్మి, కూరగాయలు పెంచి, మగవాళ్ళకు తోడుగా ఆడవాళ్ళు పిల్లలు కూడా ఆర్జించకపోతే తన పుట్టిల్లు అంత ఎక్కి వచ్చేదా?

స్వయం వుపాధి పథకం క్రింద అప్పు తీసుకొని కోళ్ళఫారం పెట్టింది. కిచెన్‌గార్డెన్ వేసింది. చిన్న డైరీఫారం నెలకొల్పింది. యింట్లో అన్నీ బంగారు బాతులే కావటంతో భర్తను మించిన ఆర్జనాపరురాలూ అయింది.

ఆర్జించేటప్పుడు ఎన్ని మెళుకువలు ప్రదర్శిస్తుందో, ఖర్చుచేసేటప్పుడు అన్ని మెళుకువలు తెల్ససుమతికి. ఆ అంశంలోనే ఆమెకు రామేశం విరుద్ధం.

రామేశానిది సంపాదించటంతో పాటు ఖర్చు పెట్టే చెయ్యి. స్వంతానికే కాకుండా మొగరు టాలకు పోయి పార్టీలు వినోదాలు, చందాలకని ఖర్చుచేస్తుంటాడు. సంపాదించే చెయ్యికి తెలియకుండా రెండో చెయ్యి ఖర్చు చేస్తుంటే ఆ సంసారం ఎక్కదని సుమతి నిశ్చితాభిప్రాయం. అయినా ఆమె భర్తతో పోట్లాటకు దిగదు.









# కా డ

'చూడండి మీ సర్గాలను నేను కాదన కూడదు కానీ కుటుంబమొక వ్యవసాయ క్షేత్రం లాంటిది దంపతులనేవారు సంసారమనే కాడికి వివాహం ద్వారా కట్టివడేసి క్షేత్రంలోకి వదిలేసిన ఎద్దుల్లాంటివారు. రెండు ఎద్దులూ కాడిని కలిసిమోసి, కలిసిదున్నితేనే క్షేత్రం ఫలానిస్తుంది. ఎద్దులు చెరోవైపు లాక్కెళితే ఆ క్షేత్రం కొన్నాళ్ళకి బీడే అవుతుంది'

అంటూ సమయం సందర్భం చూసుకొని అనేక విధాల భర్తను మెల్లగా తనమార్గానికి మళ్ళించుకొంది. ఖర్చుచేసే విషయంలో రామేశం యిప్పుడు సుమతి ఎంత చెప్తే అంత. కాఫీ ఎక్స్ట్రాగా మరోసారి తాగాలన్నా భార్య పర్మిషన్ తీసుకోవల్సిందే.

అయినా కొట్టే చెయ్యి, తిట్టే నోరు వూరుకోవన్నట్టు, రామేశం అప్పుడప్పుడు మొహమాటాలకి పోయి, అఫిషియల్ ప్రెస్టీజి కోసం చందాలలిస్టులో చేరిపోతుంటాడు. అలాంటి సందర్భాలలో సుమతికి భర్తను చూస్తే జాలేస్తుంది. భర్త గౌరవానికి భంగం కలగకుండా ఎలాగోలాగా ఖర్చు తప్పించే ప్రణాళికలు వేయటంలో ఆమెకామెసాటి!

ఆరోజు రామేశం ఆఫీసునుంచి రావటమే ఆలస్యంగా వచ్చాడు. ఆఫీసు నుంచి రాగానే కోళ్ళఫారంని, కిచెన్ గార్డెన్ని చూచి భార్యను పొగడటం అతని అలవాటు. అలా చేయకుండా ఆ వేళ షర్టు అయినా విప్పకుండా కుర్చీలో కూలబడ్డ భర్తను చూస్తే సుమతికి ముద్దేసింది.

ఫేనువేసింది. హార్లిక్స్ కలిపి యిస్తూ అతడిని ఆప్యాయంగా పలకరించింది. బూటు లేసులు, షర్టు బటన్లు విప్పింది. ఫేను గాలికి అతని మొహం మీద అల్లలాడుతున్న వెంట్రుకల్ని ప్రేమగా సర్దింది. సమయం చూచి అతని తలను కౌగిట్లోకి తీసుకొని తియ్యటి ముద్దునొకదాన్ని ప్రేమగాయిచ్చింది.

'ఏమిటలా వున్నారు? చందాపద్దులో మళ్ళీ పేరు రాసి వచ్చారా?'

అలాంటి సందర్భాల్లో రామేశం వో పట్టాన అసలు విషయం చెప్పడు. లాలించి సుమతి రాబట్టాలిసిందే.

'ఊహూ' అంటూ తలను అమాయకంగా వూపేడు రామేశం.

'ఫ్రెండ్స్‌కు పార్టీ యివ్వటం కోసం అప్పుచేసేరా ? ఫర్వాలేదు చెప్పరూ ?'

'ఊహూ.' అంటూ అతను తలవూపకుండా జేబులోనుంచి రెండు సినిమా టిక్కెట్లు తీసేడు. పాపం! సినిమాకు తనతో కల్సిపోదామని బుద్ధిపుట్టి అడ్వాన్సు బుకింగ్ చేయించివుంటాడు. ఆఫీసునుంచి పెందలాడే రావటానికి వీలుపడివుండదు. టిక్కెట్లు వేస్ట్ అయ్యాయని విచారపడుతున్నాడు!

ఆ ఆలోచనకు సుమతికి గర్వంకలిగింది.

'మీరెంత మంచివారండీ. అడ్వాన్సు బుకింగ్ చేయించి ఆలస్యంగా వచ్చినందుకు బాధపడుతున్నారా ? పరీక్షహాల్లోనైతే ఆరంభమయిన అరగంట దాటితే రానివ్వరుగాని సినిమాహాల్లో అలాంటి బాధలేదుగా ? నేను నిముషంలో తయారవుతాను. యిప్పుడెళ్దాం. మునిగిపోయిందేముంది ?' లేవబోయింది. రామేశం ఆమెను వదలేదు.

'యివాళకికాదు, టిక్కెట్లు రేపుకు'

'అయితే యింకబాధేముంది ? హాయిగా చూచొద్దాం. సినిమా ఏమిటి ?'

'కొత్తసినిమా. రేపే రిలీజ్ పైగా అగ్రనటీనటులు వున్నారు.'

'పరులకు దానాలు, ధర్మాలుచేస్తే దండగ కానీ – అప్పుడప్పుడు సినిమాకు వెళ్ళటం నాకుమటుకు సర్దాకాదనుకున్నారా ? రేపు వెళ్దాంలెండి. అవునూ ? అడ్వాన్స్‌బుకింగ్‌కు మీదగ్గర డబ్బెక్కడిది ?'

'అడ్వాన్స్ బుకింగ్ కాదు'

'మరి ? ఎవరైనా మీ పార్టీ వుచితంగా యిచ్చారా ?'

'ఊహు పొరపాటుచేసేను'

'అసలు విషయంచెప్పు డియర్. నేను కోప్పడనుగా ?' అంటూ సుమతి ప్రేమగా అడగంగా అడగంగా రామేశం చెప్పాడు. ఆ వెంటనే సుమతి ఆలోచనలో పడింది.

'సినిమా రేపు వుదయమే! యిప్పుడెలా?'

అర్ధరాత్రికి ఆమె మనసులో ఛటుక్కున ఓ ఆలోచన మెదిలింది. సుమిత్ర ఆమె కళ్లముందు నిలబడింది.

*       *       *

సుమిత్ర, సోమేశ్వరరావుల దాంపత్యం చూస్తూన్నా, కాడికికట్టిన ఒంగోలు జాతి జోడెద్దులే గుర్తుకొస్తాయి. అయితే ఆ ఎద్దుల అందం పైపైనే. లోపల ఏదో 'క్రానిక్ డిసీజ్'తో బాధపడూ నీరసంగా నిస్పత్తువుగావున్న బక్క ఎద్దులవి.

ఆ క్రానిక్ డిసీజ్ పేరు 'బీదరికం'

సుమిత్ర, సోమేశ్వరరావు లిద్దరూ బీద కుటుంబంలోంచే వచ్చారు. సుమిత్ర అందాన్ని చూచి మోహించాడు. ఆమె మంచితనంచేత ఆకర్షించబడ్డాడో, లేక ఆదర్శాల పొంగులో ఆమెను చూచి జాలిపడ్డాడో తెలియదుగానీ, కాణీకట్నంలేకుండాఆమెను పెళ్ళిచేసుకొన్నాడు. సుమిత్రది నానాకాలం చదువు. ఉన్నదానిలో జాగ్రత్తగా సర్దుకుపోవటంతప్ప ఆర్జించే మెళుకువలు తెలియదు.

సోమేశ్వరరావు కూడా డిగ్రీ తర్వాత చదువు ఆపి ఏదో వుద్యోగంవస్తే చేరిపోయి, వుద్యోగంలోవుంటూ పోస్టుగ్రాడ్యుయేట్ అయి, చిన్నగా లెక్చరర్ అయ్యాడు. జీతం తప్ప దమ్మిడీ పైఆర్జనలేదు. పేరుకు గజెటెడ్ అయినా కాలేజీలోనూ యింట్లోనూ ప్యూను మొదలు ఆఫీసరుదాకా అన్నీ అతనే. ఆర్జనకన్నా గౌరవంగా కన్పించాల్సిన బాధ్యత ఎక్కువ. రాబడికన్నా కుటుంబ బాధ్యతలు, ఖర్చు హెచ్చు.

సోమేశ్వరరావు తన స్వంతానికి పైసా ఖర్చు చేయడు. కానీ తనమీద ఆధారపడ్డ వాళ్ళకి ఏలోటూ రానివ్వడు. బిడ్డల ఆనందం కోసం ఎంతైనా ఖర్చుపెడ్తాడు. వాళ్ళ ఆనందంకోసం, గౌరవంకోసం, తన సుఖాన్ని మవునంగా త్యాగం చేస్తాడు.

'ఎందుకండీ ? వాళ్ళకి మళ్ళీ కొత్త బట్టలు ? పోయిన దీపావళికి కొన్నారుగా ?'

'గడచిన దీపావళి పాతదే. రాబోయే దీపావళి కొత్తది'

'పోనీ- కాల్చిపారేసేవేగా ? బాణాసంచా లైనా కొనకుండా ఊరుకోండి'

'ఎదురింట్లో, పొరుగింట్లో మతాబాలు వెలిగితే మన పిల్లల మొహంలోకి వెలుగు వస్తుందా ? ఆ పిల్లల మానసిక ఆనందానికి వెలగట్టటం కష్టంకాదూ ?'

'మీకు మరి బట్టలు లేవండీ ఓ రెండు జతలు కొనుక్కోండి. మీకన్నా నేము ముఖ్యమా ? అప్పుచేసైనా వచ్చేనెల మీరు కొనుక్కోవాల్సిందే'

చిరునవ్వే సమాధానం. అలా ఎన్నినెలలు, సంవత్సరాలు గడచిపోయాయో ?

ఆ దీపావళికి ఎలాగైనా భర్తకు మంచి పేంటు, షర్టు తనే కొనాలని సుమిత్ర నిర్ణయించుకొంది. గత దీపావళి నుంచే, అసలే తగ్గించిన ఖర్చుల్లోనుంచి మరికొంత తగ్గించి, చీమలా డబ్బు కూడ బెట్టసాగింది. కానీ ధరలు నెలనలా పెరుగుతూండె! పాలు, పూలు తగ్గించి, వేలుకూడ బెట్టటం సాధ్యమా ?

దీపావళి దగ్గర పడుతోంది. అంత వరకు తను పోగుచేసినడబ్బు లెక్కచూచుకొంది. పర్వాలేదు. ఏదో నాదకంది పేంటు షర్టూ కొనటానికి మోయినడబ్బు కూడింది.



## కాడి

పిండికొద్దీ రొట్టె! ఆ రోజుకు పేంటు షర్టు కుట్టించి తీసుకొచ్చి యిచ్చి భర్తను ఆశ్చర్యపరచాలి! ఆయన ఎలాగూ పండుగకు, పిల్లలకీ తనకీ బట్టలు కొనక వూరుకోరు. యీసారి తమతోపాటు ఆయన కట్టుకొంటే అదీ నిజంగా తనకు పండగ!

'అమ్మగారూ...'

ఆ పిలుపుతో సుమిత్ర ఆలోచనలో నుంచి బయటపడింది. ఆరోజు ఆదివారం. పైగా భర్త ఏదో పనిమీద వూరుకెళ్ళేడు. పిల్లలు తలంట్లు అని బాత్‌రూమ్‌లో దూరేరు. అందుకే బియ్యంచేట ముందువేసుకొని తాపీగా ఆలోచనలో పడింది సుమిత్ర.

'ఎవరూ?' అంటూ తలుపుతెర్చింది. సుమతిగారి ఆఫీసు ప్యూను.

'సినిమాకి టిక్కెట్లు వచ్చాయిటండీ మా అమ్మగారికి. వాళ కి వెళటానికి కుదరదట! మీరు వెళ్తారేమో కనుక్కొని రమ్మన్నారండీ. కొత్త సినిమా. యివాళే రిలీజ్'

యీలోగా పెద్దకూతురు తలంటు పోసుకొని తయారయి వచ్చింది. ఆ పిల్లకి సినిమాల పిచ్చి.

'వెళ్దాంమమ్మీ. సినిమా బాగావుంటుందని మా స్కూల్లో టాక్ వచ్చింది' అని అందుకొంది. 'ఎన్ని టిక్కెట్లు?' ప్యూనుని అడిగింది.

'రెండు అండీ. పదిగంటలకే ఆటప్రారంభంటండీ, మీకు వీలుంటే టిక్కెట్లుయిచ్చి రమన్నారండీ. మిగతా విషయాలు సాయంత్రం మాట్లాడుకోవచ్చని చెప్పమన్నారండీ'

'ఆ టిక్కెట్లు వుచితంగాయిస్తున్నట్లా? అమ్ముతున్నట్లా?' కూతురికి సందేహం చెప్పింది.

'అమ్మేట్లయితే ముందే చెప్పదూ? ప్యూన్‌ని పంపుతుందా? ఒకవేళ అమ్మితే మటుకు నష్టమేమిటమ్మా? యీ సినిమా మనం ఎప్పుడోప్పుడు చూచితీరాల్సిందే. ఒక్కసారి మొట్టమొదటిరోజు, మొదటి ఆట చూద్దాం మమ్మీ' రహస్యంగానే అంది కూతురుకూడా.

సుమిత్రకెందుకో అనుమానంగా వుంది. అయినా ఆశ!

'మీ అమ్మగారినోసారి బయటకు రమ్మనరాదూ? మాట్లాడుతాను'

## ఉదయం

చీకటి గుండెల్ని చీలుస్తూ
'వెలుగు' బొట్టుల్ని పిండితే
ఉద్భవిస్తోంది ఉదయం!
(హృదయం!)

— ఇమంది రామారావు

'అమ్మగారు లేరండీ. ఎక్కడికో పనుండి వెళ్ళేరు. టిక్కెట్లు మీకక్కర్లేకపోతే రుక్మిణమ్మగారికో, సావిత్రమ్మగారికో యిమ్మన్నారండీ.'

'ఎందుకు? మేంపోతాంలే అంటీతో చెప్పు' కూతురే టిక్కెట్లు తీసేసుకొంది.

హడావుడిగా తల్లీకూతుళ్ళు రిక్షాకట్టుకొని వెళ్ళేసరికి ఆట అప్పుడే ఆరంభమయింది అయినా ఎవరో సాదరంగా ఆహ్వానించి తీసికెళ్ళి సీటులోకూర్చో పెట్టేరు. ఏమిటబ్బా! యింత మర్యాద?

ఇంటర్వెల్‌లో తెల్సింది అసలువిషయం! అది బెనిఫిట్ షో!

'ఉచితంగా వచ్చిన టిక్కెట్లు కనక సరిపోయింది. అదే డబ్బిచ్చి అవుతే తలనొప్పి కొనుక్కొన్నట్లే!' అంది సినిమానుంచి తిరిగి వస్తుండగా సుమిత్రతో కూతురు.

* * *

'సినిమా టిక్కెట్లు తీసుకొన్నారుటా? మాకు వేరే రెండుటిక్కెట్లున్నాయి. అయినా రావటం పడలేదండీ. కొత్త సినిమా చూచే ఛాన్సు కాస్తా పోయింది. సినిమా బాగుందిట?' అంది సుమతి సుమిత్రతో నవ్వుతూ – ఆ సాయంకాలం.

'థ్యాంక్స్ అండీ. పర్వాలేదు' అంది సుమిత్ర కూడా భయంభయంగా నవ్వుతూ.

'ఆ– సినిమా ఎట్లా వుంటేనేం డి ఏదో వో సంస్థకు విరాళం యిచ్చిన తృప్తి వుంటుందిగా? నిజానికి 'బెనిఫిట్‌షో'లన్నీ పూరికే చూపిస్తున్నట్లండీ. సినిమాకైతే అంత డబ్బుపెట్టి కొనుక్కువెళ్లటం ఎందుకు?'

సుమిత్ర గుండె ఝారుమంది. కొంపతీసి ఆ విరాళం చెల్లించమనదు కదా?

'విరాళం మావారు ముందుగానే చెల్లించారుటలెండి తొందరేం లేదు. మీకు వీలున్నప్పుడే యివ్వండి' తియ్యగా అంది సుమతి. సుమిత్రకు గుండె ఆగినంత పని అయింది. సుమతి చెప్పిన అంకె విన్నాక నిజంగానే గుండె వో క్షణం ఆగింది. నీరసం శరీరాన్ని ఆవహించింది. రెండు టిక్కెట్లు వెల పాతిక రూపాయలు!

'మీ వ్వాను ఆ విషయం మాకు చెప్పలేదండీ' అంది నగంచచ్చి సుమిత్ర.

'ఛ! అలాంటి విషయాలు వ్వాళ్ళో చెప్పి పంపిస్తారుటండీ. మనకు పరువు తక్కువకాదూ? డబ్బు విషయాలు మనం మనం మాట్లాడుకోవాలండీ వ్వానుల దగ్గర ఎప్పుడూ మాటాడకూడదు చులకనై పోతాం. గుర్తుంచుకోండి' హితబోధ చేసింది సుమతి సుమిత్ర ఏడుపాపుకొంది. కూతుర్ని తిట్టుకుంటోంది.

'మామూలు టిక్కెట్లను కొన్నామండీ. బెనిఫిట్ షో టిక్కెట్లని వో మాట చెప్పి పంపిస్తే బాగుండేది. మా అమ్మాయి పోరు పెట్టబట్టి వెళ్ళాను. అసలు మేమీ మధ్య సినిమాలు చూడటం లేదు. మీకు తెల్సుగా?'

'అందుకే కొత్త సినిమాకదా అని మీకు పంపించాను. 'బెనిఫిట్ షో' అని సినిమా హాలు వద్ద పెద్ద బోర్డు కట్టేరుటగా? చూడలేదూ?'

చూడకపోవటం. తనతప్పే! కానీ అందుకు యింత పెద్దశిక్షా?

'ఏమైనా పాతికరూపాయలు ఖర్చు అమకుంటె నేను సినిమాకు వెళ్ళక పోదునండీ.' ధైర్యం తెచ్చుకొని చివరికి సుమిత్ర గట్టిగానే అంది.

"బాగుందండోయ్ మీ ధోరణి? యింతకీ మీ వుద్దేశ్యం ఏమిటి? డబ్బు యివ్వనంటారా? సినిమా చూచిందిమీరు! డబ్బు నేను చెల్లించాలా! బాగుందండీ న్యాయం?" అమితనిష్ఠూరంగా అన్నా సుమతి మొహంలో కోపం ఎక్కడా లేదు. ప్రసన్నంగా, శాంతంగానే వుందామె గొంతు.

'మామూలు టికెట్లకయ్యే డబ్బు...'

'ఛ ఛ! మీలాంటి వాళ్ళనాశ్రిత మాట కాదండీ అది! వో మంచి కార్యానికి సహాయం చేశామనుకొన్నా సరిపోతుందే? మీమీద అభిమానంవుండి ఆ టిక్కెట్లు మీకు పంపించాము రంగమ్మగారు, రాధమ్మగారు మీకు పంపించినందుకు నిష్ఠూరం ఆడేరు కూడా. బెనిఫిట్ షో గనుక మనకు అంత చీప్‌గా చిక్కాయి మామూలు షోలకు అవే టిక్కెట్లు, రెండూ వంద, యాభైలు పోసి కొన్నారట! తెల్సా?'

'మీరు నాకుముందే యీ విషయాన్ని చెప్పి పంపాల్సిందండీ.'

'మళ్ళీ అదే మాటంటారు! స్నేహధర్మంగా పంపించానుకాని, నేనేం టిక్కెట్లని బ్లాక్‌లో అమ్ముకొంటున్నానా? మేము తీసుకొన్నటిక్కెట్లు, మాకు వీలుకాక మీకిచ్చాం. మీరు వెళ్ళొచ్చారు. వెధవ పాతికరూపాయలకి మీరిలా మాట్లాడుతారని తెలిస్తే అసలు మీకు పంపించే దానినా? పోనీలెండి. మనం యీ విషయం పై తగాదాలాడుకోవద్దు. అసహ్యంగా వుంటుంది. అన్నయ్యగారొచ్చాక ఆయనతో చెప్దాం. ఆయన నిర్ణయానికి యిరువురం కట్టుబడి వుందాం. సరేనా?'

సుమతి విడిచిన ఆఖరి అస్త్రం సుమిత్ర మీద పనిచేసింది.

భర్తకు యీ విషయం తెలిస్తే బాధపడ్తాడు గౌరవం కోసం డబ్బు యిస్తాడు. డబ్బుపోయి ఆయనక్కూడా యీ మనస్తాపం ఎందుకు?

'సరేలెండి. మళ్ళీ ఆయన దాకా ఎందుకు? మీ డబ్బు మీరు తీసుకోండి'

కష్టపడి, భర్త బట్టలకోసం కూడబెట్టిన డబ్బులోనుంచి పాతికరూపాయలిస్తూ దైన్యంగా ఏడిచింది సుమిత్ర! తీసుకుంటూ విగతాళిగా మనసులోనే నవ్వుకొంది సుమతి!

'యిదిగో - టిక్కెట్టుకి పదిహేను రూపాయలు. వాళ్ళెవరికో యిచ్చెయ్యండి వెంటనే. కానీ యిలాంటి కంచి గరుడసేవలు మరెన్నడూ చేయకండి యీ పది తీసుకెళ్ళి మంచి సినిమాకి టిక్కెట్లు రిజర్వు చేయించండి సర్దాగా వెళ్దాం' అంది గర్వంగా సుమతి భర్తతో.

'యూ ఆర్ ఎ జీనియస్ డార్లింగ్' అన్నాడు రామేశం ఆమెను అమాంతం వాటేసుకొని, ముద్దు పెట్టుకునే భంగిమను అభినయిస్తూ.

ఆ కాడికి కట్టిన ఆ జోడెద్దులు అలా ఆడుతూ పాడుతూ అలవోకగా తమ క్షేత్రంతోపాటు ఇతర క్షేత్రాలలోకి జొరబడి దున్నుకొని సస్యశ్యామలం చేస్తున్నాయి. కనుకనే ఆ కాడికి ఎదురు బరువులేదు. ఆ ఎద్దులకి కాడి బరువనిపించదు. అలాంటి ఎద్దులని తనకు కట్టినందుకు కాడి గర్విస్తుంటుంది. అంతా తన గొప్పే అని మురిసిపోతుంది!

*　　*　　*

ఇదేమిటి? ఈనగాచి నక్కలపాలు చేసినట్లు అయిందేమిటి? వుంగరాల చేత్తో మొట్టే నొప్పి వుండదు అన్నట్లు చేసిందే సుమతి! అన్ని తెలిసి తెల్సి తను వ్యామోహంలో పడి పోయిందా? భర్తకు వో జతబట్టలు కొనియిచ్చే సమర్థత లేదా తనకు? ఏం సంసారం యిది? మూలుగుతూ లేస్తూ ఎన్నాళ్ళీదటం?



# కాడి

భర్త ఊరినుంచి తిరిగి వచ్చినా యివే ఆలోచనలు - ఆవేదన!

ఆరోజు ఆఫీసునుంచి వస్తూనే భార్యకు ఓ ఉత్తరం అందించాడు. ఉత్తరానికి నాలుగుమూలలా పసుపు పూసివుంది — శుభసూచకంగా!

"మా చెల్లెలికి కొడుకు పుట్టేడుట! బాలసారెకు రమ్మని రాశాడు బావ." నీరసంగా అన్నాడు కుర్చీలో కూలబడుతూ.

భర్త మనసులో బాధను అర్థంచేసుకోగలదు సుమిత్ర. పిల్లలనువదిలేసి తానిద్దరూ వెళ్ళాలన్నా రైలు ఛార్జీలకే బోలెడంత ఖర్చు. వెళ్ళకపోతే నిందలు - నిష్ఠూరాలు! తప్పించుకొనేదారిలేదు.

మెదలకుండా లోపలికెళ్ళి మిగిలినడబ్బు తెచ్చి భర్త చేతిలో పెట్టింది సుమిత్ర.

'అర్ధాంగి అంటే యిలా వుండాలి' అన్నట్టు, సోమేశ్వరరావు కళ్ళు మెరిసేయి

బాలసారెనుంచి తిరిగివస్తూ భార్యా భర్తలిద్దరూ, నెలాఖరుకు రోజులు లెక్కపెట్టుకో సాగేరు!

అలా ఆ కాడికికట్టిన ఆ రెండెద్దులూ, పడుతూ లేస్తూ, ఒకరు అలిసిపోతే మరొకరు ఓదారుస్తూ, బరువుగా, భారంగా, కాడిని యీడుస్తూ క్షేత్రాన్ని దున్నుకొంటూ, చావకుండా బతకటానికి అవసరం మేర పండించుకొంటూవున్నాయి ఆ ఎద్దులకి కాడి బరువు. ఆ కాడికి, ఎద్దులంటే విసుగు— బరువు.

అయినా, ఆకాడికి ఎద్దులు, ఎద్దులకి కాడి తప్పదు.

కానీ...

మొదటి జత ఎద్దుల్నిచూచి రెండోజత ఎద్దులు మనసులోనన్నా మౌనంగానన్నా ఏడవటం సహజం కదా? ఒకేజాతి అయినా ఆ ఎద్దులకంత ఆరోగ్యమేం? తమకెప్పుడూ యీ రోగమేం? యీ ఎద్దు ఎద్దుల పోట్లాటగా మారితే?

అయితే — రెండోకాడి మొదటికాడిని చూచి ఏడవదు. కోపంతో కళ్ళెర్రచేస్తుంది. వీలైతే ఆ మొదటి కాడిని విరగ్గొట్టేద్దామన్నంతకోపం? ఆ కోపం కాడులమధ్య స్పర్థకు దారితీస్తే?... ఎట్‌లీస్ట్, లెట్ గాడ్ ఫర్‌బిడ్ యిట్ - వేర్ మేన్ ఫెయిల్స్!

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## రాజమాత ప్రబోధం -

భారతీయ జనతాపార్టీ ఉపాధ్యక్షురాలు రాజమాత విజయరాజేసింధియా డిశంబరు 26న భారతీయ జనతాపార్టీ మహిళా విభాగం హైదరాబాద్ నగర శాఖా సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ, మహిళలు రాజకీయాలకు దూరంగా ఉండరాదని ప్రబోధించారు. రాజకీయాలతో తమకు సంబంధం లేదనుకోవడం పొరపాటని, సామాజిక కర్తవ్యాన్ని విస్మరించడమని కూడ ఆమె హెచ్చరించారు. రాజకీయాలలో జోక్యం చేసుకోకపోతే వారి స్థితి మరీ అధ్వాన్నమవుతుందని ఆమె మరొక హెచ్చరిక చేశారు. భారతీయ జనతాపార్టీ మత ప్రధానమయిన పార్టీ కాదని, భగవంతుని, సత్యాన్ని విశ్వసించేపార్టీ అని, ఈ రెండింటిలో విశ్వాసమున్న ఎవరైనా తమ పార్టీలో చేరవచ్చునని, ఏ దేవుడే గొప్ప మరే దేవుడు గొప్ప కాదనేదే తమ పార్టీకి లేదని, పాలకపక్షం, పాలకుల వర్గం తమ పార్టీపై అకారణంగా దుష్ప్రచారం చేస్తున్నదనీ ఆమె అన్నారు. భారతీయ జనతాపార్టీ కార్యకర్తలు దళితవర్గాల కోసం నిర్మాణాత్మక కార్యక్రమం చేపట్టాలని ఆమె కోరారు. నల్లకుంటలోని దీనదయాళ్ వాటర్ ట్యాంకు మాన్యుఫ్యాక్చరర్స్ ఇండస్ట్రియల్ కో ఆపరేటివ్ సొసైటీ ఏర్పాటు చేసిన సమావేశంలో రాజమాత ప్రసంగిస్తూ, భారతీయ జనతాపార్టీ రాజకీయ కార్యక్రమాలనే కాక, ప్రజోపయోగి కార్యక్రమాలు చేపట్టాలని కోరారు. భారతీయ జనతాపార్టీ ఎం. ఎల్. ఏ. శ్రీ రామారావు తమ ప్రసంగంలో రాష్ట్ర భారతీయ జనతాపార్టీ చేపట్టిన పెక్కు నిర్మాణ కార్యక్రమాలను గురించి వివరించారు.

## శ్రీ వేణుగోపాల్ హిప్నాటిజం ప్రదర్శనం :

జూపిటర్ టైప్-అండ్ షార్ట్‌హేండ్ ఇన్‌స్టిట్యూట్ రజతోత్సవ సందర్భంగా డిశంబరు 20వ తేదీన ఇందిరా ప్రియదర్శిని హాలులో ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్ శ్రీ వేణుగోపాల్ హిప్నాటిజం ప్రదర్శనం చేశారు. హిప్నాటిజం ప్రభావంలో ఉన్న వ్యక్తిని తల, కాళ్ళు మాత్రం కుర్చీలు ఆధారంగా పడుకోబెట్టి పొట్ట మీద పదిమణుగుల బరువు మంచుగడ్డను పగులగొట్టడం, పట్టి కాళ్లతో మంచుగడ్డపై నిలబెట్టడం — ఈ రెండు ప్రదర్శనంలో ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించిన విషయాలు. శ్రీ వేణుగోపాల్ ఇప్పుడిప్పుడే పోటు హక్కు సంపాదించుకున్న నవ యువకుడు. ఈయనకు భవిష్యత్తులో గొప్ప పేరు ప్రఖ్యాతులు ఉండగలవని విశ్వసిస్తున్నాను. శ్రీ వేణుగోపాల్ వైఖరి, ఆత్మవిశ్వాసంతో ప్రవర్తించే తీరు, ఆకట్టుకునే పద్ధతి ఆయన భావి ఖ్యాతిని చెప్పకే చెబుతున్నాయి. పిదప సుప్రసిద్ధ ఐంద్రజాలికుడు శ్రీ బి. వి. పట్టాభిరామ్ ఇంద్రజాల ప్రదర్శనం, గంటన్నరసేపు జరిపి ప్రేక్షకులను ఆనందపరిచారు. శ్రీ పి. పార్థసారథి సుయోధన మయసభా సందర్శనం ఏకపాత్రాభినయం కడు సమర్థనీయంగా నిర్వహించారు. ఆయన సహజంగానే స్ఫురద్రూపి, మంచి మైకట్టు గలవారు గనుక పాత్రకు మిక్కిలి శోభ చేకూర్చారు. వాచికం, ఆంగికం చాల ప్రశంసనీయంగా ఉన్నాయి. సమావేశానికి ముఖ్య అతిథిగా వచ్చిన ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులు శ్రీ పోతన్నూరు వెంకటేశ్వరరావు హిప్నాటిజం గురించి, మనశ్శక్తులను గురించి ప్రసంగించారు. అధ్యక్షత వహించిన శ్రీ తిరుమల రామచంద్ర హిప్నాటిజం అనేది నిద్రార్థకమయిన హిప్నాస్ అనే గ్రీకు పదం నుంచి పుట్టిందని, హిప్నాస్ అనేది స్వప్న అనే సంస్కృత పదానికి సమానమని, మనిషిని నిద్రపుచ్చడానికి భారతదేశంలో మణిమంత్రౌషధాలతో పెక్కు ప్రక్రియలు పూర్వం ఉండేవని, సమ్మోహనం గురించి సుశ్రుతుడు, తంత్రసారాది గ్రంథకారులు అథర్వవేద ఋషులు చెప్పారన్నారు.

## డాక్టర్ జక్కర్ సూచన :

లోక్‌సభ స్పీకరు డాక్టర్ బలరాం జక్కర్ డిశంబరు 28, 29 లలో జరిగిన విధానసభల ప్రిసైడింగ్ ఆఫీసర్ల సమావేశం తొలినాడు ప్రసంగిస్తూ చైతన్యంలేని సభా కార్యక్రమాలు సుదీర్ఘమైన ఉపన్యాసాలు ఉంటే, అది ఆదర్శ విధాన సభ కాదని అన్నారు. ప్రజల ఆశలను, ఆశయాలను, నిరాశానిస్పృహలను కూడ విధాన సభలు ప్రతిఫలింపచేయాలి అని ఆయన అన్నారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో విధాన సభల పాత్రను అవగాహన చేసుకోనందున వాటి ప్రతిష్ఠ దిగజారిపోయిందని కొందరు చేస్తున్న వాదం తనకు అర్థం కావడం లేదని, ప్రస్తుత సమాజాన్ని, సమయాన్ని ప్రజల భావాలను పార్లమెంట్, విధాన సభలు ప్రతిబింబించడం సహజాతి సహజమని ఆయన అన్నారు. విధాన సభల్లో ఎదురయ్యే సమస్యలను గురించి ఈ సమావేశం చర్చించింది. ఈ సమావేశములో లోక్‌సభ స్పీకరు, డిప్యూటీ స్పీకరు, రాజ్యసభ చెయిర్మెన్, వివిధ రాష్ట్రాల స్పీకర్లు, డిప్యూటీ స్పీకర్లు, విధానపరిషత్తుల చెయిర్మెనులు, డిప్యూటీ చెయిర్మెనులు పాల్గొన్నారు.

## సృజన ఆర్ట్స్ థియేటర్స్ ప్రథమ వార్షికోత్సవం :

సృజన ఆర్ట్స్ థియేటర్స్ విశిష్ట సంస్థ. దీనిలో సమాజంలోని మేధాజీవి వర్గాలకు చెందినవారు డాక్టర్లు, న్యాయవాదులు, కథాకారులు, రచయితలు, పత్రికా రచయితలు, కవులు, పండితులు, కార్య నిర్వాహణాధికారులు, వ్యాపార నిపుణులు, విజ్ఞాన శాస్త్రజ్ఞులు—అందరూ సభ్యులు. చెప్పడం మరచాను ఐంద్రజాలికులు కూడా ఉన్నారు. కనుక ఈ సంఘం సమావేశాలు, నాటకాది ప్రద



ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య కుమారై వివాహ సందర్భంగా ప్రముఖ ధ్వన్యనుకరణ విద్వాంసుడు, డాక్టరు నేరెళ్ల వేణుమాధవ్, సుప్రసిద్ధ గాయని శ్రీమతి ఎం. ఎస్. సుబ్బులక్ష్మిగార్ను సన్మానించిన సందర్భంలో తీసిన చిత్రం.

## హైదరాబాదు నోట్ బుక్

ర్శనాలు ప్రజలను ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు. నెలకొక ప్రదర్శ మివ్వడం, నాటకమో, నాట్యమో, పుస్తకావిష్కరణమో, కవి సమ్మేళనమో, సాహిత్యగోష్ఠో — ఈ సంస్థ లక్ష్యం. చందాల కోసం ఒకరి చేతకు పోకుండా, గ్రాంట్ల కోసంఅడ్డుపుంతలు తొక్కకుండాతమ కష్టార్జితంలో కొంత సద్వినియోగం చేసి ఈ సంస్థను నిర్వహించ నిర్ణయించారు. ఇది ఆదర్శప్రాయమైన పద్ధతి. ఈ సంస్థ డిశంబరు 25న ప్రథమ వార్షికోత్సవం విజయవంతంగా జరుపుకొన్నదన్న దానికి త్యాగరాజ గానసభ ప్రేక్షకులతో కిటకిట లాడడమే సాక్షి. సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ తిరుమల రామచంద్ర, ముఖ్య అతిథి అయిన ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆంగ్ల శాఖ రీడరు డాక్టర్ మొదలి నాగభూషణశర్మ సంస్థలక్ష్యాలను, కార్యకలాపాలను ప్రశంసిస్తూ, సభ్యులు దీక్షతోను, అరమరికలు లేక పనిచేసినప్పుడే సంస్థ ప్రవర్ధిల్లుతుంది అని సలహా యిచ్చారు. సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ బి. వి. పట్టాభిరామ్ సంస్థ ప్రారంభ సంచిక ''ధ్వని''ని ఆవిష్కరించారు. ప్రముఖ న్యాయవాది శ్రీ గోపాలం ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. సంస్థ అధ్యక్షుడు శ్రీ పి వి. విజయకుమార్, కార్యదర్శి శ్రీ సి. వి. ఎల్. నరసింహారావు.

**చార్మినార్‌లోను చీకటి :**

డిశంబరు 4వ తేదీన భారత రాజధానిలోని కుతుబ్ మినార్‌లో చీకటిలో తొక్కిసలాటలో జరిగిన ఘోర ప్రమాదంలాంటిదే చార్మినార్‌లోను జరిగేఅవకాశం ఉందని, చార్మినార్‌లోను చిమ్మచీకట ఉందని, భారత పురాతత్త్వశాఖ ఈ విషయంలో శ్రద్ధతీసికొనాలనిపలువురుకోరుతున్నారు. గోలకొండనవాబు కులీకుతుబ్‌షా 388 సంవత్సరాల క్రితం నిర్మించిన ఈ అపూర్వవాస్తునిర్మాణం ఎత్తు దాదాపు 180 అడుగులు దీనిని చూడడానికి దేశ విదేశాల నుంచి వేలాదిమంది రోజూ వస్తుంటారు. రోజూ సగిసేను వందల మంది, సెలవు దినాల్లో అంతకు వేయిమంది ఎక్కువగాను, శుక్రవారాల్లో ప్రవేశం ఉచితం కనుక దాదాపు అయిదు వేలమంది దీనిని ఎక్కి నగర సౌందర్యాన్ని చూడడానికి వస్తుంటారు. ఈ కట్టడం నాలుగు శిఖరాలలోను దీపాల ఏర్పాటులేదు. మెట్లు కూడా చిన్నవి. దుండగులు కుతుబ్ మినార్‌లో లాగ దుర్జన్యాలు చేయవచ్చు. పది సంవత్సరాల క్రితం పాడయిపోయిన విద్యుద్దీప వ్యవస్థను పునరుద్ధరించడం అవసరమని చార్మినార్ నిర్వాహక ఉద్యోగులు కూడా కోరుతున్నారు.

**ఉపశ్రుతి :**

ఎంప్లాయిమెంట్ ట్రెయినింగ్ ఇన్స్టిట్యూట్‌లో అకౌంట్స్ ఆఫీసరు శ్రీ ఎస్. సి. శేషాచార్యుల కవి,భావుకులు. ఇటీవల ''భగవన్నుతి'' అనే కావ్యం నాకు అందించారు. ఏమిటి? మీ కావ్యానికి ఆవిష్కరణోత్సవం జరుపరా?— అని అడిగాను. ఆ విష్ నాకు లేదు — అన్నారు ఆయన. మంచి అన్యభాషాశ్లేష చేశారే? — అన్నాను. నా పేరు శేషాచార్యులు. శ్లేషాచార్యులు అనేరు? — అన్నారు ఆయన.

# పంతులు బాబాయి

పట్టమట్ట మాణిక్యాలరావు



"ఏం బాబూ! ఇంటర్వ్యూ ఎలా చేసావు?" అని ఆత్రుతగా ప్రశ్నించింది పార్వతమ్మ, అప్పుడే ఇంట్లోకి అడుగు పెట్టిన కుమారుడికి మంచినీళ్ళు అందిస్తూ.

"ఇంటర్వ్యూ బాగానే చేసానమ్మా. రిటెన్ టెస్టులో అన్నీ బాగానే రాసాను. కాని మన నుదుటి రాత బాగుండాలిగదమ్మా. అది మనం రాసింది కాదుగా!" తల్లి అందించిన, మంచినీళ్ళు తాగి, చొక్కా విప్పి హేంగర్‌కు తగిలించి, గాలి బాగా వీస్తుందని దొడ్డి గుమ్మం గడప మీద కూర్చున్నాడు.

"ఏం బాబూ! అలాగంటున్నావు. అయితే ఫలితాలు తెలిసినట్టేనా. పోనీలే బాబూ. ఏం చేస్తాం. ఇంతకీ మన రోజులు బాగాలేవు. మీ నాన్నగారే బ్రతికుంటేనా... ఎంతమందికి ఆయన ఉపకారాలు చేసారు! తీరా సొంత కొడుకు చేతికి అందివచ్చే సమయానికి విధి మనల్ని చిన్న చూపు చూసింది. ఇదంతా మన దురదృష్టం బాబూ."

"అమ్మా! ఇంటర్వ్యూ చేసిన ఆఫీసరుకి నాన్నగారిని తెలుసుటమ్మా. 'పంతులు బాబాయి'గారి అబ్బాయా మీరు? అంటూ చాలా ఆనందించారమ్మా. ఆయన చిన్నతనంలో మెట్రిక్ పరీక్షలకు ఫీజు లేకపోతే ఆ డబ్బు నాన్నగారే సాయం చేసారుట. ఆయన అది చెప్పి చాల బాధ పడ్డారమ్మా. పేరుకి తను ఆఫీసరు అయినా గాని ఉన్న ఉద్యోగాలలో కొన్ని వెనుకబడిన తరగతులకు రిజర్వుడు, మిగిలినవి ఆయన పై అధికారుల ఇష్టానికి రిజర్వుడుట. ఇంటర్వ్యూ చెయ్యడం వరకే తన పని అని, అంచేత తన చేతులలో ఏమి లేదని, తనని తప్పుగా అర్థం చేసుకోవద్దని అన్నారమ్మా. నిజంగా ఆయన చాలా మంచి వారమ్మా. నాన్నగారి గురించి, ఆయన ఆదర్శ జీవితాన్ని గురించి చెప్తూ, ఈనాటి మన స్థితి విని, చాలా బాధ పడ్డారు. కానియ్యి మనకి కూడా మంచి రోజులు రాక పోవులే అమ్మా" అంటూ తల్లి ఇచ్చినకాఫీ తాగి బయటకి నడిచాడు శర్మ. బయటికి వెడుతున్న కొడుకును చూచి, నిట్టూరుస్తూ లోపలికెళ్ళి ఆలోచనలలో మునిగిపోయింది పార్వతమ్మ.

* * *

"పంతులు బాబాయి" అంటే తెలియనివారు గోదావరి మండలములో ఎవరూ లేరంటే అతిశయోక్తి కాదు. పంతులు బాబాయి అంటే తెలియని రాష్ట్ర నాయకులు ఎవరూ ఆ రోజులలో లేరు. ఎందుకంటే ఆయన తత్వం అలాటిది. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ పది మందితో కలిసి తిరిగే మనిషి. ఖద్దరు పంచ, మోకాళ్ళ కిందకి వేలాడేలాల్చీ, పైన కండువా, కాళ్ళకి తోలు చెప్పులు, చిన్న గిరజాల జుత్తు, ఫాలభాగంలో మూడవ నేత్రంలా మెరిసే ఎర్రని కుంకుమబొట్టు: ఇదీ ఆయనవేషం. ఎక్కడికక్కడ కలిసిపోయే తత్వం ఆయనది. అందరూ సిగరెట్లు త్రాగుతూంటే, ఆయనసిగరెట్లు తాగుతాడు. అంతేకాదు ఆశువుగా అరగంట ఆగకుండా ఆ సిగరెట్టుపై కవిత్వం చెప్పగలడు అది ఒట్టి సభా పూజ్యమును దట్టించేవాళ్ళ సమావేశమే అయితే, తను ఆ ముక్కు పొడుం

## గ మ ని క

వ్యక్తుల పేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరు పైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి పంపండి.

సం.



## పంతులు బాబాయి

పట్టింపులో ఆనందాన్ని అనుభవిస్తాడు. అంతేకాదు. ముక్కుపొడుం ఎలా తయారు చెయ్యాలో, పుగాకు రేకు ఎంత వేడిచేయాలో ఎంత నెయ్యి రాయాలో వగైరాలతో ఉప న్యాసాలిచ్చేవాడు. అలాగే కాఫీ,టీ లయినాకాని.

ఆ రోజులలో అనగా దేశం స్వాతంత్ర్యోద్యమ సంగ్రామములో తలమునకలుగా ఉన్న రోజులలో 1923 లో అఖిల భారత కాంగ్రెసు మహా సభలు కాకినాడలో నేటి గాంధీనగరంలో జరిగాయి. ఆనాడు ఆనాటి ఆ సమావేశములకు ఆహ్వాన సంఘాధ్యక్షులు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు గారు, కార్యదర్శి మహర్షి సాంబమూర్తిగారు. బులుసు సాంబమూర్తిగారంటే పంతులు బాబాయికి ప్రత్యేక అభిమానం, గౌరవం. సమావేశంనాడు పంతులుబాబాయి నేర్పు, చాకచక్యం, కలుపుగోలుతనం. మహాత్మా గాంధీగారిని కూడా ఆకర్షించాయి మహర్షి సాంబమూర్తిగారు, ప్రకాశం పంతులుగారు, కళా వెంకట్రావు, పట్టాభి, తెన్నేటి, క్రొవ్విడి లింగరాజు, పళ్లంరాజు ఒకరేమిటి అందరితోను కలిసిపోయి, అందరికీ కావలసిన వాడై, తానొక్కండైనా అందరికీ ఒక్కొక్కడై సలహా సంప్రదింపులకు, ప్రతివ్యక్తికి ఆత్మీయతతో దగ్గరయ్యేవాడు. ఆనాడు బ్రిటీషు పాలకులు కుత్సిత బుద్ధితో జరిపిన లాఠీచార్జీలో టౌనుహాలు దగ్గర మహర్షి సాంబమూర్తిగారిని లాఠీలతో బాదుతూంటె నిజంగా ఆనాటి పరిస్థితి చాలా హృదయ విదారకంగా ఉంది. ఆయన నెత్తుటి మడుగులో పడి వున్నారు. అది చూచి పంతులు బాబాయి గిలగిలలాడి పోయాడు. తర్వాత ఆయనకు సేవచేసు ఏడ్చేవాడు. అప్పుడు పంతులుబాబాయిని ఓదార్చడం మహర్షి వంతు అయింది.

అసలు చిత్రమేమిటంటే, పంతులు బాబాయి పైన పేర్కొన్న నాయకులందరి కన్నా చాలా చిన్నవాడు. అయినా అందరూ పంతులు, పంతులుబాబాయి అనే పిలిచే వారు. ఆఖరికి తన అసలు పేరు ఏమిటో తనే మరిచిపోయి, పంతులు బాబాయే తన పేరు అని నిర్ధారించుకున్నాడు. రాజమండ్రి దగ్గర సీతానగరంలోని సుబ్రహ్మణ్యంగారి ఆశ్రమం నుంచి శ్రీ మద్దూరి, క్రొవ్విడి లింగరాజుగార్ల సంపాదకత్వంలో వెలువడు తున్న "కాంగ్రెసు" పత్రికలో పంతులు బాబాయి రచనలు పుంఖాను పుంఖాలుగా వెలువడుచూ, సంపాదకుల ప్రోత్సాహంతో ప్రజలను చైతన్య వంతుల్ని చేసేవాడు. కారాగారవాసంకూడా తప్పలేదు ఇంత ఉత్సాహంతో కార్యక్రమాల్లో పాల్గొంటున్నా ఏనాడు తన పనులకు ఒక గుర్తింపు ఉండాలని గాని, తనని అందరూ పొగడాలనిగాని, తనొక ప్రథమశ్రేణి నాయకుడుగా చలామణీ అవ్వాలని గాని, ఎప్పుడూ ఆశించలేదు. నిజానికి ఈనాటి రాజకీయ నాయకుల స్వార్థ బుద్ధి, పదవీ వ్యామోహం పంతుల బాబాయికి ఉండి వుంటె ఈ కథ యింకొక విధంగా వ్రాయవలసి వచ్చేది

యిటు రాజకీయాలేకాదు, సాహిత్యం విషయానికి వస్తే నిజానికి ఆ రోజులలో పంతులు బాబాయి పాల్గొనకుండా గోదావరి మండలంలో ఏ సాహితీ సమావేశము జరిగేది కాదు. అసలు సమావేశాలకు రాణింపు పంతులు బాబాయితోనే వచ్చేది, అంటే అతిశయోక్తి కాదు. అందులో కులపతి అడవి బాపిరాజు గారికి, యితనికి బాగా స్నేహం కుదిరింది. "బాపి బావ" అంటూ చెట్టాపట్టాలేసుకుని తిరిగేవారు. నాలిక మీదెప్పుడు శశికళ నృత్యం చేస్తుండేది.

శ్రీ కోపల్లె హనుమంతరావు పంతులు గారు, పట్టాభి సీతారామయ్యగారు, ముట్నూరు కృష్ణారావు గారలు ముగ్గురు పవిత్ర ఆశయాలతో మచిలీపట్నంలో స్థాపించిన ఆంధ్ర జాతీయ కళాశాలలో బాపిరాజుగారు కొద్దికాలం ప్రిన్సిపాల్‌గా పని చేసారు. ఆ జాతీయ కళాశాల అంటే పంతులు బాబాయికి ఎంతో — పూజ్యభావం. అది ఒక పవిత్ర దేవాలయం అనేవాడు. అక్కడే కవిసామ్రాట్ విశ్వనాథ వారితో పరిచయం కలిగింది. విశ్వనాథ వారన్నా వారి వేయి పడగలన్నా మాటలతో వర్ణించలేని అభిమానం. ఆనాడు ఆంధ్ర జాతీయ కళాశాల విద్యార్థులు తర్వాత ఎంతెంతో ఉన్నత స్థానాలు పొంది, వివిధ కళారంగాలలో పేరెన్నిక గన్నారు.

కాకినాడ చుట్టుప్రక్కల ఎక్కడ అష్టావధానము జరుగుచున్న అక్కడ 'పంతులు బాబాయి' పృచ్ఛకుడుగా ఉండ వలసిందే. హాస్యమునకు పృచ్ఛకులుగా శ్రీ గండికోట జోగినాథంగారు గిలిగింతలు

మిగతా పిల్లల్ని వాడే పైకి తీసుకుంటాడు – అని ఊహిస్తూంటే, అతని ఊహ ఊహలలో ఉండగానే, అకస్మాత్తుగా గుండెనొప్పితో రాత్రికి రాత్రే నిద్రలోనే, ఆఖరి శ్వాస తీసుకుని, వెళ్ళిపోయాడు.

తెల్లవారి చూచి అందరూ గొల్లు మన్నారు.

*　　*　　*

వారి వీరి సాయంతోను, దగ్గర ఉన్న నాలుగు కొబ్బరిచెట్లపై వచ్చే డబ్బుతోను, ఒకటి రెండు ప్రైవేట్లు కూడా చెపుతూ ఏదో రకంగా సంసారం నెట్టుకొస్తున్నారు. పాపం. ఆనందరావు కూడా సహాయం చేస్తున్నాడు. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకడం చాల కష్టంగా ఉంది. ఉద్యోగం దొరకడం ఎంత కష్టంగా ఉందో, నిజానికి ఒక ఉద్యోగానికి అప్లికేషను పెట్టడం అంత కష్టంగా ఉంటోంది. రోజు గడవడమే కష్టంగా ఉంటుంటే, ప్రతి అప్లికేషను లోను రూపాయలకు రూపాయలు పోస్టలు ఆర్డరు, ఫోటోలు, రాక (యువ్వని) ఉద్యోగాల ఇంటర్వ్యూలకు రానుపోను ఖర్చులు, వాటికి సరిపడ చేతిలో డబ్బులేక చాల ఉద్యోగాలకు దరఖాస్తులు చెయ్యడం మానుకున్నాడు. నిజం చెప్పాలంటే ఉద్యోగం పొందడానికి తక్కువ అనర్హత కేవలం ఒక్కటే! అదే అతని కులం. కేవలం అగ్రకులం అయినంత మాత్రాన, అతని ఆర్థికస్థితి మారిపోదుగా? అయితే ఒకటి, నిజానికి రిజర్వేషనులు చాల అవసరం అని పంతులు బాబాయి గట్టిగా వాదించేవాడు. తప్పకుండా రిజర్వేషనులు ఉండాలి. వారంపరి అభివృద్ధే నిజానికి దేశాభివృద్ధి.

ఏ జనులైనా అందరూ సోదరులే అనే భావం కలిగిననాడే నిజానికి గాంధీజీ ఆశించిన రామరాజ్యపు కలలపంట సిద్ధిస్తుంది. అయితే ఈ రిజర్వేషన్లు ఎదుటివారికి బాధాకరం కాకూడదు. క్షుద్ర, స్వార్థ రాజకీయాలకు యిటువంటి సున్నిత సమస్యలే సమిధలుగా ఉపయోగపడుతూ, అమాయకుల పడుమ అసూయాద్వేషాలు రగిలిస్తున్నాయి. చేయి చేయి కలపవలసినవారు, చేయి చేయి నరుక్కుంటున్నారు. అంతేకాని యిది అసలు వ్యక్తి గత నైపుణ్యాలు పెంచుకోవలసిన సమస్యకాదు– అనేవాడు పంతులు బాబాయి. అంతేకాని, తన కొడుక్కి ఉద్యోగము దొరకక

## పంతులు బాబాయి

పోవడానికి కేవలం ఏదో ఒక వర్గము వారే కారణమని ఏనాడు ఆయన అనుకోలేదు. అది రాజ్యాంగము నిర్దేశించిన సూత్రము.

వ్యాధి మూలాన్ని తెలుసుకొని మందు వేయాలి కాని, కాలుమీద కురుపేసిందని, చెయ్యి నరుక్కుంటే మంచిది కాదు– అని చెప్పేవాడు, నమ్మేవాడు.

*　　*　　*

"బాబూ! ఏం చేద్దాం. నిల్లుండే మీ నాన్నగారి సంవత్సరీకాలు. చూడబోతే చేత గవ్వలేదు. ఏం చేయడం? యిటు విశ్వగాడు రెండు రోజులనుంచి కళ్ళు తెరవడంలేదు. యింకా ఏదో ఆ డాక్టరుగారు మీ నాన్నగారి స్నేహితులు కాబట్టి, ఊరికే చేస్తున్నారు. ఎలాగో ఏమిటో!"

"ఊరుకో అమ్మా! అన్నిటికీ ఆ దేముడే ఉన్నాడు. ఎలా జరిగేది అలాగే జరుగుతాయి. నాన్నగారు ఎప్పుడూ ఎవరికి అన్యాయం చెయ్యలేదు. ఆయన మంచితనమే మనకెప్పుడూ దారి చూపెడుతూంటుం

### చావటానికి హక్కు!

అణ్వస్త్రయుద్ధం సంభవిస్తే విప రీతమైన ప్రాణనష్టం జరుగుతుందని అందరికీ తెలుసు. అయితే ఒక రకంగా ఆలోచిస్తే చనిపోయేవారే అదృష్ట వంతులనిపిస్తోంది. అణ్వస్త్రాలకు గురై, వికలాంగులుగా మారి తీరని వ్యధతో క్షణ క్షణం మృత్యువుతో పోరాడే వారి సంగతి చెప్పనలవికాదు. అందుకని అటువంటి పరిస్థితుల్లో వీరందరికీ చనిపోయే హక్కు వుండాలని పశ్చిమ జర్మనీలోని ఒక వర్గం కోరు చున్నారు. ఈ వర్గంలో సుమారు వెయ్యిమంది వున్నారు. వీరి కోరికకు తగినట్లుగా చట్టాన్ని సవరించాలని కూడా వీరు ప్రభుత్వాన్ని కోరు చున్నారు. మృత్యువే మానవునికి ఉప శమనం కలించగలసందర్భంలో, డాక్టర్లు మృత్యువునివ్వకపోతే, రోగులే మృత్యువు నాహ్వానించవచ్చునని వీరు వాదిస్తు న్నారు.

దమ్మా. మూర్ఖాం. అన్నిటికి వాడే ఉన్నాడు. ఉండు ఏదో రిక్షా గుమ్మంలో ఆగింది. ఎవరో వచ్చినట్లున్నారు, మన గుమ్మంలోనే దిగారు. ఎవరొచ్చుంటారు."

"అమ్మా! నేనమ్మా. ఆనందరావుని వచ్చేను" అంటూ పిలుస్తూనే మెట్లెక్కి లోపలికి వస్తున్న ఆనందరావుని చూసి "రా బాబూ. రా కాళ్ళుకడుక్కో" అంటూ చెంబుతో నీళ్ళిచ్చింది పార్వతమ్మ.

"అమ్మా! రేపు నాయనగారి రోజు కదా అని బొంబాయి నుంచి వచ్చానమ్మా ఆయన ప్రసాదం తినాలి. నేను ఈరోజు యిలా ఉన్నానంటే నాయనగారి చలవే అమ్మా తమ్ముడూ నిజం చెపుతున్నా. ఆ నాడు నేను అనాథను అవటంచేత మావాళ్లే నన్ను చూడని రోజుల్లో, నాచేత బలవంతంగా చేయిస్తున్న పాలికాపు పని మానిపించి, నన్ను చేరదీసి, నేను చదువుకుంటాను అని ఉత్సాహం చూపిస్తే, నాకు చదువు చెప్పించి నన్ను మనిషిని చేశారు నాయనగారు. మీ చేతి చలువ మంచిదవడముతో, మీరు నా నోటి కిచ్చిన మొదటి ముద్ద అక్షయమయి, నన్ను పైకి తీసుకువచ్చి, సంఘంలో నాకొక ఉన్నత స్థానం కలిపించింది. ఒక వ్యక్తిగా నిలబెట్టింది. వ్యాపారంలో అభివృద్ధి చెందాను. అమ్మా! మీరు ఎప్పుడూ నన్ను వేరుదృష్టితో చూడలేదు. కన్న తల్లి దండ్రులు ఎవరో తెలియని, పాపఫలంగా సాటివారిలో అనాదరణతో పెరుగుతున్న నన్ను మీరు తమ్ముడితో సమానంగా పెంచారు. ఎంతోమంది కేవలం నోటితో చెప్పే మాటల్ని నాయనగారు తన విశాలమైన మనసుతో ఆచరించి చూపెట్టారమ్మా. యింకా నిజం చెప్పాలంటే అమ్మా! నిజంగా మీ మంచితనమే నాయనగారి ఆదర్శాలకు మూలస్తంభం అమ్మా. అమ్మా యికమీరేమి చెప్పవద్దు. యిదిగో ఈ డబ్బుతో నాయనగారి రోజు పూర్తి చేయండి. తర్వాత మీరు, తమ్ముళ్లు నాతో వచ్చేయ్యండి. అక్కడ తమ్ముడికి ఉద్యోగం యిప్పిస్తాను. యిక్కడ ఈ పోటీలలో తమ్ముడు నెగ్గలేడు. వాడికి అనలే నోటిలో నాలుక లేదు. ఏమంటావు తమ్ముడూ" అంటూ గలగల మాటాడుతూ, జేబులోంచి నోట్ల కట్ట తీసి యిస్తూంటే జవాబు చెప్పలేక, నిలబడిపోయింది పార్వతమ్మ.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీము ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందిం చేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుంగంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మి మనసుకు నచ్చుతుంది.**

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




DC.G.74 TL

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥




### శ్రీ సాయినాథ బోధామృతము

శ్రీ సాయిబాబా అభయ ప్రదానములు — సూక్తులు, రచన : కీ.శే. శ్రీ బాపట్ల హనుమంత రావు. 350 పేజీలు గల ఈ గ్రంథం వెల 20 రూపాయలు. ప్రతులకు: ప్రచురణకర్త శ్రీబాపట్ల వేంకట పార్థసారథి, శ్రీ సాయీ నిలయం, చెరువు (పోస్టు) గుంటూరుజిల్లా — 522113.

### శ్రీ తులసీ రామాయణము

సుందరకాండము. అనువాదం : శ్రీ మిట్టపల్లి ఆదినారాయణ. 64 పేజీలు, వెల రు. 2లు. ప్రతులకు, తులసీ నికేతన్, సంగడిగుంట,గుంటూరు—3.

### వర్కిన్ పాటలు

68 పేజీలు గల ఈ పుస్తకంలో శ్రీ వర్గిస్‌రాసిన 47 జానపద పాటలు ఉన్నాయి. వెల మూడురూపాయలు. ప్రతులకు: పీస్ బుక్‌సెంటర్, హైదరాబాద్ లేక సృజన, హనుమకొండ, వరంగల్ కి రాయవచ్చు.

### గద్దర్ పాటలు

84 పేజీల ఈ పుస్తకంలో శ్రీ గద్దర్ 84 పాటలున్నాయి. వెల రూ 3—50 పైలు ప్రతులకు పీస్‌బుక్ సెంటర్ హైదరాబాద్ లేక సృజన, వరంగల్ కి రాయాలి.

### వేమన కవితా ప్రశస్తి

పద్య,గేయ,వచన రచనలు. సంకలనకర్త,సంపాదకుడు : సాల్మిబాబు. 30 పేజీలు. వెల : అమూల్యం, ప్రచురణ : సాహితీ నికుంజము, నరసాపురం—534275.

### ఆమె నవ్వింది

కథల సంపుటి, రచన: శ్రీ పంతెన సూర్యనారాయణరాజు, 60 పేజీలు, వెల రు 3—75. ప్రతులకు : ఆంధ్ర సారస్వత పరిషత్, తిలక్ రోడ్డు, హైదరాబాద్.

### ఎక్స్‌రే

ఆధునిక కవితావేదిక నవంబరు, 81 సంచిక. 8 పేజీలు, వెల 25 పైసలు. ప్రతులకు, వివరాలకు : ఎక్స్‌రే, కొల్హారి హౌస్, అమలాపురం—533202.

### పొరుగింటి వారమ్మాయి

కథల సంపుటి రచన కీ. శే. శ్రీ దిగుమర్తి వెంకటరామారావు. 146 పేజీలు గల ఈ పుస్తకంలో మొత్తం తొమ్మిది కథలు ఉన్నాయి. వెల: 8 రూపాయలు. ప్రతులకు: బృందావన్ పబ్లికేషన్స్, కాకినాడ—4.



డిసెంబరు 20 న విజయవాడలోని షెతయ్యా కళాక్షేత్రంలో గాస్పెల్ మెసెంజర్స్ వారు నిర్వహించిన క్రీస్తు జయంతి వేడుకల సందర్భంగా ప్రదర్శించిన 'క్రీస్తు జననం'నృత్యరూపకంలో ఒకదృశ్యం. జి. రాజ్యలక్ష్మి, షెరీ చెరియన్, వై. రామకృష్ణలని చిత్రంలో చూడవచ్చు.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna